3-4-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి :63 సంచిక :14 విడిప్రతి : రు. 1.50 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

# ఎన్టీఆర్ రాజకీయం ఇన్సూరెన్స్‌కు బలి!

ఎన్టీరామారావుకు, తెలుగుదేశం పార్టీకి ఏదో చెడ్డకాలం నడుస్తున్నట్టున్నది; వారి రాజకీయ ప్రాభవాన్ని రాహువేదో ఒకటి గ్రహణం రూపంలో పట్టి, చీకటి పాల్జేస్తున్నట్టుంది. లేకుంటే రెండున్నర కోట్ల ఇన్సూరెన్స్ డబ్బు చేతి కందినట్లే అంది చేజారడమేమిటి? ప్రధానికి అమ్ముడుపోయారన్న ప్రచారంలో పరవు పోవడమేమిటి?

రాజీవ్ గాంధీ హత్యానంతర అల్లర్లలో హైదరాబాద్‌లోని ఎన్టీఆర్ సినిమా థియేటర్లు తగులబడిపోయిన సంగతి తెలిసిందే. దురదృష్టవ శాత్తు అప్పటికి ఇన్సూరెన్స్ ప్రీమియం కట్టలేదు. ఎన్టీఆర్‌ను ఈ దహనాలు ఎంతో దుఃఖక్రాంతుడ్ని చేశాయి. నిజామాబాద్‌లోని ఒక బ్యాంకులో వెనుక తేదితో ప్రీమియం కట్టినట్లు డ్రాఫ్ట్ సృష్టించడానికి చేసిన ప్రయత్నము

**చేతికందిన రెండు కోట్లూ జారిపోయాయి!**

విఫలమైంది. దానితో డబ్బు చేజారి పోయిందనే అందరూ భావించారు.

అయితే, ఆ తర్వాత ఏమి జరిగిందో పరమాత్ముడికి తెలియాలి కాని, థియేటర్ల నష్టపరిహారం ఫైలు ఇన్సూరెన్స్ కంపెనీలో రహస్యంగా నడిచి, రెండున్నర కోట్ల రూపాయలకు చెక్కు వ్రాసే దశకు వచ్చేసింది. తమ కళ్ల ఎదుట జరిగే ఈ దోపిడీ చూడలేని ఆ కంపెనీ ఉద్యోగులు కొందరు, మద్రాసు హై కోర్టులో కేసు దాఖలు చేశారు. చేతికి అందిందని అనుకున్న చెక్కు కాస్త చేజారిపోయింది. ఇంకొక ప్రక్క కోర్టు కేసుకుముందే ఈ సంగతి బయటకు పొక్కింది. నంద్యాలలో ప్రధాని శ్రీ పివి నరసింహా రావుకు పోటీ పెట్టకుండ దానికి కారణం ఈ ఇన్సూరెన్స్ సొమ్మేనని కాంగ్రెస్ వాళ్లు అగుడుచేసి పారేశారు.య ఈ ప్రచారం ఒకరకంగా పివి ప్రతిష్టకు భంగకరమే. సచ్ఛీలత్వం, నిజాయితీ, నిష్కాపటాతులతో ప్రధాని త్వం నెరవుచ్చిన్నారనుకున్న పివి, అప్టరాల్ నంద్యాల ఎన్నిక కోసం ప్రతిపక్ష నాయకుడికి ఇన్నికోట్ల ప్రజల ధనం దోచి పెట్టమాశాడంటే – ఆయన పట్ల ప్రజలలో సదభిప్రాయం తుడిచి పెట్టుకొని పోతుంది గదా?

ఈ ఆరోపణ నిజమైనా, అబద్ధమైనా పివి కంటే, ఎన్టీఆర్ కే రాజకీయంగా . దెబ్బతగిలింది.

కొరవ 8 పేజీలో

## సోలంకీ శోకం!



బోఫోర్సు నిత్యాగ్ని హోమంలో మరొక రాజకీయ జీవి సమిధగా మారింది. కేంద్ర విదేశాంగ శాఖామంత్రి శ్రీ మాధవ సింగ్ సోలంకి తన పదవికి రాజీనామా చేసి ఇంటిదారి పట్టాడు.

సోలంకి గారి ఇంతటి శోకానికి కారణం -బోఫోర్సుకు సంబంధించినఒక జాబు. ఆ మధ్య విదేశాలకు వెళ్ళే సమయంలో ఎవరో ముక్కుముఖం తెలియని న్యాయవాది ఆయన దగ్గరకు వచ్చి,ఒక జాబు ఇచ్చి, స్విట్జర్లాండ్ మంత్రికి ఇవ్వమని కోరాడట. మనమంత్రిగారు బెస్టుపోస్టుమన్ తరహాలో దానిని అక్కడికి చేర్చారట. తీరా చూస్తే అందులో, బోఫోర్స్‌పై దర్యాప్తు నిలపమని వ్రాసివుంది. అది ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కళ్ళలో పడింది. పార్లమెంట్‌లో గగ్గోలు లేచింది. ఆ విమర్శఘాతాలకు తట్టుకోలేక సోలంకి

కొరవ 8 పేజీలో

# కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు మారవు!

ప్రభావవి అరవై సంవత్సరములలో అంగీరస అరవది. అంగారక అధిపత్యముగల వత్సరముగ జ్యోతిశాస్త్రమున చెప్పబడినది. తెలుగుసంవత్సర వారాధిపతియు మేష మిధున కటకతులా ధనుర్మకర సంక్రమణ వారాధిపతులును, అర్ద్రకార్తె ప్రవేశ సమయ వారాధిపతియు కలిసి వననాయకులుగ సంవత్సరాధి పతులుగ శాస్త్రము నిర్దేశించుచున్నది.

లభించుటచే వస్త్రపుల ధరలు ధాన్యముల ధరలు పెరుగును. పాలు సమృద్ధిగా దొరకును. గురువు సస్య. నీరసాధిపత్యములు పొందినందున గోధుమ, శనగ పంటలు బాగుగ ఫలించును.

ఎర్రనేలలు ఫలసాయము నెక్కువగ నివ్వగలవు. లోహ వస్త్రవల ధర పెరుగుదల స్వల్పము.

## రాజకీయ ఒడిదుడుకులున్నా అంగీరసలో పాడి పంట నీరు సమృద్ధం

**స్వయంపాకుల శ్రీనివాసులు**

### నవనాయక ఫలితాలు

ఈ సంవత్సర నవ నాయకులలో ఆరుమంది శుభు[illegible]. ముగ్గురు క్రూరులు. శుభాధిక్యత చేత దేశ పాలన క్రమతో సాగినను సుఖప్రదముగ జరిగిపోవును. శనికి సంవత్సరాధిపత్యము, రసాధిపత్యము లభించి నందున గత సంవత్సరము వలెనె వర్షము తృప్తి కరముగా నుండును. రస వస్తువులు ఎక్కువగా ఫలించును. దోపిడీలు, దొంగతనములు పెరుగును అధికారమునకై పెనుగు లాటలు దేశమంతట [illegible]క్కువగును. ప్రజలలో పాలకులలో అవినీతి వర్తన వృద్ధి చెందును. [ చంద్రునకు మేఘ. ఆర్ఘ. సేనాధిపత్య. సచివత్వములు

### వర్ష, జగల్లగ్న ఫలితములు

సంవత్సరారంభ లగ్నము వృషభమై, దాని అధిపతి శుక్రుడు, వక్రించిన బుధునితోను, దోషులైన తృతీయ చతుర్థాధిపతులగు చంద్రుడు సూర్యులలో కలసి లాభస్థానమున నుండుట వలన యోగకారకుడుగు శనిచే చూడబడుట వలన దేశ పాలకులు అనేక ఒడుదుడుకుల నెదుర్కొనుచు దక్షులుగా ఉత్తమ పాలకులుగ పేరు పొందుదురు. భాగ్యస్థానమున శని యుండుట వలన విదేశ సహాయము పుష్కలముగా నుండును. గురుకుజాలు సుఖ రాజ్యస్థానములందుండుట వలన కొన్ని ప్రాంతములందు సైనిక శాసనముల వంటివి విధింపబడును. గ్రహములన్నియు షష్ఠాష్టకము లందు; ద్విర్ద్వాదశములందుండుట వలన కేంద్ర రాష్ట్రముల మధ్య అభిప్రాయ భేదము లేర్పడును. అష్టమాధి పతి గురువుకు కేంద్రాధి పత్యము వలన ఉత్తర రాష్ట్రములలో ప్రభుత్వ నేతల మార్పులు; రక్తపాతము ఏర్పడును. దశమమున కుజుడు, ద్వితీయమున కేతు వుండుటవలన ద్రహోల్బణ ముండును. మేష రాశి ప్రవేశ సమయమున లగ్నము కన్యయై; జగల్లగ్నమనిపిలవబడును. జగల్లగ్నాధిపతి బుధుడు వక్రించి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు. మారవు శుక్రునితో చేరి నీచ భంగ యోగ కారకుడుగుట వలన మన దేశ ప్రభుత్వమునకు క్షేమకరమే. ఇండియాకు తూర్పు నగలదేశములలో ప్రభుత్వనేతల మార్పులు[illegible]డును. రాహు గురువులు చతుర్థ వ్యయములందుండుట వలన ప్రపంచ ప్రజలకు సౌఖ్యము తక్కువ. బుధ శుక్రులు సప్తమ కేంద్రమున నుండుట వలన మన రాష్ట్ర కేంద్ర నాయకత్వములు మారవు.

### మధ్యభారతంలో భూకంపాలు

షష్ఠమున అంగారకుడుండుట వలన దేశమునకు ఋణము లభించును. పంచమాధిపత్యము వత్సరాధి పత్యము శనికి లభించుట చే మన దేశమునకు యుద్ధ భయము లేదు. మధ్య భారత్‌లో భూకంపములు తూర్పు పశ్చిమ రాష్ట్రము లందు పెద్ద వాహన ప్రమాదములు కలుగ గలవు. ప్రపంచ దేశాల మధ్య యుద్ధ ప్రమాదాలు లేకున్నను. అశాంతి తీవ్రవాద చర్యలు యధావిధిగా కొనసాగును.

### వర్షానికి, నీటికి, పంటలకు కొరత లేదు!

21.6.1992 తేది ఆదివారము రాత్రి 1.30 గంటలకు ఆర్ద్ర కార్తె ప్రవేశము కలదు. అప్పటిలగ్న స్థితిని బట్టి చూచిన అన్ని రకముల పంటలు చక్కగ ఫలించి, ధాన్య వృద్ధియుండును. దేశమున అన్ని ప్రాంతములందు వర్షము విస్తారముగ కురిసి నీటి సమస్య తీరెదను. ప్రజలకు ధాన్యమూలక ఆదాయము బాగుండును.

1 తూము వర్షము $10\frac{1}{2}$ విసముల పంట ఫలించి ప్రజలు సుఖించెదరు.

### రెండు శుక్ర మౌఢ్యాలు ఒక గురు మౌఢ్యమి

11.5.92 తేది మొదట 16.7.92 వరకు శుక్రమౌఢ్యమి మరల 29.3.92 నుండి 3.4.93 వరకు శుక్ర మౌఢ్యమి 4.9.92 తేది మొదలు 2.10.92 వరకు గురుమౌఢ్యమి ఈ

కొరవ 11 పేజిలో

## రావయ్యా శనీశ్వరా, రా!

*సత్యవేటి శ్రీకాంత్*

చిరిగిన ఓ జోన్ పొర
ఛత్రముగా,
బొగ్గు పులుసు వాయువు
వింజామరగా,
యాసిడ్ వర్షాలు
పన్నీటి జల్లులుగా
ఎయిడ్స్ వంటి రోగాలు
రథ చక్రాలుగా
వికటాట్ట హాసంతో
విర్రవీగుతూ వస్తున్న
శనీశ్వరా స్వాగతం!
ఈ అంగీరస సంవత్సరం
నీదే!
నీవే ఈ ఏడాదికి రాజువి
నలుడి కాలం నుంచీ
నీ ప్రతాపం వింటున్నాం!
ఇన్నేళ్ళకు మా తెలుగు
సంవత్సరాధిపతిగా
ఎదురొచ్చావు!
పలాయన మంత్రం
పఠించను నేను!
జీవిత మంటే పలాయనం
కాదు!
అది నిర్భయ ప్రస్థానం!
జీవిత మంటే, [illegible]పం
కాదు
అది నిత్యనూతన
ప్రయత్నం!
చావు తప్పదని తెలిసీ
బ్రతికే మానవుడిని, నేను!
నిన్ను స్వాగతించేందుకు
సంకోచించను!
సందేహించను!
రావయ్యా శనీశ్వరా, రా!



### మతి తప్పిన మాటలకు మనం మతి కోల్పోవాలా?

మతి భ్రమణపు మాటలకు బాగున్న వారు గూడా మతులు పోగొట్టు కోవాలా ? పోగొట్టుకోకూడదు. పోగొట్టు కోవడం ధీమంతుల లక్షణం కాదు.

ముఖ్యమంత్రి ఇటువంటి విషయాల్లో, ముఖ్యంగా ఈ విషయంలో ధీరోధాత్తంగానే వుంటారు. కాబట్టి ఎంత రెచ్చ గొట్టినా, సహనాన్ని ఎంత పరీక్షించేవైనా, ఎంత అవమానకరమైన వైనా, అప్రతిష్ఠ పాల్జేసెవైనా, ఎంతగా గిల్లిపొడిచే వాళ్లున్నా, వులకడు పలకడు; గంభీర మౌనాన్ని వహిస్తాడు. తన ఓర్పుకు అందరూ ముక్కుమీద వ్రేలేసుకునేట్లు వ్యవహరిస్తారు. అటువంటి శ్రీ జనార్దన రెడ్డి ఈ సారి ఎందుకు వ్రతభంగం చేసుకోవాలి? మతి మాలిన మాటలకు తానూ ఎందుకు ఆ స్థాయికి దిగి రావాలి?

తిరుపతి పత్రికల వాళ్లు ఆయన్ను మరీ మొగమాట పెట్టేసినట్లున్నారు. ;జల గల్లాగ తగులుకున్నట్లున్నారు; జవాబు చెప్పక తప్పని మానసిక స్థితిని కల్గించినట్లున్నారు. అందువల్లనే ఆ ఒక్క మాటైనా అన్నట్లున్నాడు. ఆయన వెల్లడించిన విషయం బయట వారికి కొత్త; ఆయన్ను బాగా ఎరిగిన వారికి పాతది, చాల పాతది. ఇప్పటి వరకు తనలోనే దాచి వుంచుకున్న ఆ విషయాన్ని ఇప్పుడు కూడా బైట

### పినాకిని తీరం

పెట్టకుండా వుంటే ఎంత హుందాగా వుండేదా అనిపిస్తుంది.

పత్రికల వాళ్ల ప్రస్తావన వచ్చింది కాబట్టి మధ్యలో రెండు మాటలు; మమ్మల్ను - అంటే పత్రికల వాళ్లను. - నారదునితో పోలుస్తుంటారు. ఆ వెర్రివాళ్ని ఈ అసాధ్యులతో పోల్చడం ఆ బ్రహ్మపుత్రునికి అపచారం అవుతుంది. మహతిని మీటుకుంటూ, తన పాటల్లో తానే లీన మవుతూ మబ్బుల్లో విహరించే ఆ మహర్షి కలహ ప్రియుడే కాదు తగవులు తీర్చే పెద్ద మనిషి కూడా. పత్రికల వారు విభేదాలను ఎందు చిదుగుల తో మంట ఎగదోస్తారుగాని, ఆర్పడానికి ప్రయత్నించరు. పాఠకుల ఆకర్షణకు పత్రికలకు గుర్తింపుకు విలేఖరులకు అటువంటి వైఖరి అవసరం. మొన్న స్పీకరు ముఖ్యమంత్రి మనస్పర్ధలు మా పత్రికల వారి పుణ్యమే గదా! ఇప్పుడు జనార్దన రెడ్డి మౌనభంగం తిరుపతి విలేఖరుల గట్టి తనమే గదా! అందువల్ల మేము నారదునితో పోల్చదగిన అల్పులం గాదు; ఆధునిక యుగంలో అంతకంటె అధికులం .అని చెప్పకున్నాగొప్ప కాబోదు !

ఒక మనిషి ఎందరి హిట్ లిస్టులో వుంటాడు? ఎన్ని సార్లు చంపుతారు? ఎందరు చంపుతారు? ఎందుకు ప్రాణం తీస్తారు? ఎన్ని సార్లు తీస్తారు ? అసలు హత్యలు ఎన్ని రకాలు ? ఎన్.టి.రామారావు, చంద్రబాబు నాయుడు, జనార్దనరెడ్డి వగైరా వగైరాలను ఎప్పటికప్పుడు ఎందరిని తన ప్రాణ హానికి బాధ్యులుగా ప్రకటించుకుంటూ పోతారు ? నన్ను చంపుతారు ..... నన్ను చంపుతారు అని పలుమార్లు పత్రికలలో ప్రకటించుకోవడం పరువు తక్కువ కాదా? చుల్కన కాదా ? పెద్ద వారి

కొరవ 12 పేజిలో

# జమీన్‌రైతు

## స్థానిక సంస్థలు

పదవీ కాలం ముగిసిన మునిసిపాలిటీలకు ప్రభుత్వం స్పెషల్ ఆఫీసర్లను నియమించింది. రేపు నెలాఖరుతో కాలం తీరనున్న జిల్లా, మండల ప్రజాపరిషత్‌లనూ అధికారులకే అప్పచెప్పాలనే నిర్ణయం తీసుకున్నట్లు తెలుస్తున్నది. విచారకరమైన నిర్ణయం ఇది.

స్థానిక సంస్థలు ప్రజాస్వామ్యానికి పునాది వంటివి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల కంటె ప్రజలకు పంచాయితీలు, మునిసిపాలిటీలతోనే సాన్నిహిత్యం ఎక్కువ. భారత దేశంలోని స్థానిక సంస్థలకు రెండున్నర వేల సంవత్సరాల చరిత్ర వుంది. చంద్రగుప్తుడి కంటె ముందు కాలం నుంచే గ్రామాలు, రాజుల రాజధానులలో గణతంత్ర సంస్థలున్నట్లు చారిత్రక ఆధారాలున్నాయి.

గాంధీ మహాత్ముడు ప్రవచించిన గ్రామ స్వరాజ్యానికి స్థానిక సంస్థల పటిష్టత ఒక మౌలిక అంశం. స్థానిక సంస్థలు స్థానిక ప్రజల నేతృత్వంలో, స్థానిక అవసరాల ప్రాతి పదికన, స్థానిక సమస్యల పరిష్కారానికి, స్థానికులందరి సహకారంతో నడవ గల్గితే ప్రభుత్వం చేపట్టే అభివృద్ధి కార్యక్రమాలు, ఖర్చు చేసే నిధులు ప్రజలకు పూర్తిగా ఉపయోగపడతాయి. కాని అసెంబ్లీ, పార్లమెంట్ ఎన్నికలు అరక్షణం ఆలస్యం జరిగితే ప్రజాస్వామ్యం కూలిపోయినట్లు కేకలు పెట్టే నాయకులు, పార్టీలు స్థానిక సంస్థల విషయంలో మాత్రం ఎన్నికలు వాయిదా వేయడానికి ఎన్ని దారులు వున్నాయో అన్నిటినీ వెతుకుతారు; సాధ్యమైనంత వెనక్కు నెడుతారు; అధికారులను పెట్టి, పరోక్షంగా తమ పెత్తనం కొనసాగేటట్లు చూస్తారు. జనార్దన రెడ్డి సైతం ఇందుకు మినహాయింపు కాకపోవడం విచారకరం.

అధికారుల పాలన కప్పచెప్పడమంటే, స్థానిక సంస్థలను నిర్వీర్యం చేయడం క్రిందే లెక్క. అధికారుల దృష్టి ఎప్పుడూ స్థానిక సమస్యలు, అవసరాలను బట్టి వుండదు. ప్రజలతో వారికి సంబంధం వుండదు. ఇతర రాష్ట్రాలకు చెందిన డిడిఒలు జిల్లా పట్ల ఎంతటి పరిజ్ఞానం సంపాదించి, పనిచేయ గల్గుతారు? ఇతర జిల్లాల నుంచి వచ్చే ఎండిఒలు, మునిసిపల్ కమీషనర్లకు గ్రామాలపట్ల, వార్డుల పట్ల ఎంతటి అవగాహన వుంటుంది? అరకొర పరిజ్ఞానంతో వారు చేసే నిర్ణయాలు ప్రజలకు ఎంత మేరకు ఉపయోగపడుతాయి? పై పెచ్చు మొత్తం పెత్తనమంతా అధికారులకు అప్పచెప్తే, అవినీతికి హద్దు వుండదు అడిగేవాడు అడిగించుకునే వాడు వుండని పరిస్థితులలో అది సర్వసాధారణం. స్థానిక సంస్థలలో ప్రజా ప్రతినిధులు లేకుంటే, ప్రభుత్వంతో, పరిపాలనతో ప్రజలకు ప్రత్యక్ష సంబంధం వుండదు.

అసెంబ్లీలు, పార్లమెంట్‌లకు వలె, స్థానిక సంస్థల ఎన్నికలకు సంబంధించి రాజ్యాంగ బద్ధమైన చట్టం లేక పోవడమే ఈ సంస్థలు ఇట్లా తరచు గాలికి వదిలి వేయబడడానికి కారణం. ప్రతి పక్షాలు అడ్డం కొట్టకుండా, రాజీవ్ గాంధీ తల పెట్టిన పంచాయితీ రాజ్, నగర పాలిక బిల్లులు చట్టరూపం ధరించి వుంటే, ఈ పరిస్థితి ఏర్పడి వుండేది కాదు. రాజీవ్ గాంధీ పట్ల అచంచల గురుత్వం, ఆయన సిద్ధాంతాల పట్ల తిరుగులేని విశ్వాసం కల్గిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దన రెడ్డి ఆ రెండు బిల్లుల ఉద్దేశ్యాన్ని ఆచరణకు తేవడం అవసరం. ముందు ఆరునెలలు, ఆ తర్వాత అటువంటి ఆరు నెలలు, మరొక ఆరు, ఎన్నికలు లేకుండా కాలక్షేపం చేయజూడడం కాకుండా, రెండు మూడు నెలలలోనే మునిసిపాలిటీలకు, పంచాయితీ రాజ్ సంస్థలకు ఎన్నికలు జరిపించేయాలి.

అయితే, కేవలం ఎన్నికలు జరపడం ద్వారా ఈ సంస్థలు ప్రజలకు ఉపయోగపడుతాయనుకోవడం భ్రమ. ప్రభుత్వంలోని పెద్దలు వివిధ కారణాలవల్ల, గత రెండు దశాబ్దాలలో పంచాయితీ రాజ్ సంస్థల అధికారాలను పూర్తిగా తగ్గించి వేశారు; నామ మాత్రం చేశారు. ఇరవై లక్షల ఓటర్లు ఎంపిక చేసిన జి.ప్ర.ప అధ్యక్షుడు, ఒక సాధారణ అధికారి చేతిలో కీలు బొమ్మవలె వుండవలసి వస్తున్నది. అధికారి కాదంటే, చీపుర కట్ట కొనడానికి కూడా ఉత్తర్వు చేయలేని నిస్సహాయ స్థితిలో వుండవలసి వస్తున్నది. మునిసిపాలిటీలలోనూ అదే పరిస్థితి. ప్రభుత్వం ఎటూ ఆర్డినెన్సు ద్వారా ఆరునెలలు వ్యవధి పొందింది కాబట్టి, ఈ లోగా ఈ సంస్థల అధికార పరిధిని పెంచడానికి ఎన్నికయ్యే ప్రజాప్రతినిధులు, స్వతంత్రంగా వ్యవహరించడానికి అవసరమైన మార్పులతో కొత్త చట్టాన్ని తేవడం అవసరం.

# జమీన్‌రైతు

3-4-1942

8 పేజీలు అణా

### పోతన జయంతి

" పలికెడిది భాగవతము పలికించు విభుండు రామ భద్రుండట"

అన్న పోతన జయంతి ఆ రామ భద్రుని ఉత్సవాలతోటి ఉపాంగంగా రాయాజీవీధి భజన మందిరం వారు తేది 29 విజయవంతంగా జరిపిరి 'సహజ పాండిత్య' పోతనామాత్యుని "బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్నియ"ను గూర్చి వరన కవి, విద్యాప్రవీణ, విద్యాభూషణేత్యాది బిరుదాంకితులైన దిగ్గంతులు ఉపన్యసించిరి.

### నోట్లో మట్టి

కాలేజి కమిటీ 29 తేది మీటింగులో ఫలాని వారి జీతాన్ని గూర్చి ప్రసక్తికి రాగా, ఫలానివారు అడ్డుపడ్డట్లును, రాజీనామాయిస్తాను చూడు అని జందెం పిక్కున్నట్లును, కమిటీవారు భయపడి, దద్దరిల్లి వెనక్కు యిరగబడి, గాభరా అయి నట్లును, ఓటుకు బెట్టగా సంగోరు మెడిపాలు వహితేలగా ప్రెసిడెంటు గారి ఓటు కూడా వణుకుతూ పలాని వారి ప్రక్కే మొగ్గినట్లును, దాక్టర్ ఆ టీచరు నోట్లో మట్టి పడ్డట్లును, ఉపయోగింద్రుడు పరీక్షన్న హౌరాజాకుం వచ్చు.

ఏమిటయ్యా పిల్లకాయల మాదిరి ఈ బెదిరింపులు, ఈ గాభరాలు?

### సర్కిల్

నెల్లూరు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ థామస్ గారు సెలవుబెట్టారు. సర్కిల్ సెలవుబెట్టిన తర్వాత ఉత్సవాల్లో గలాటా లేదని కొందరంటారు. అదిగాదు కాల్పుల అనంతరం గలాటా లేదని కొందరంటారు. ముస్లీములు గలాటా చేయకూడదని తీర్మానించుకున్న తర్వాత గలాటా లేదని మేమంటాము.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### జిల్లా రిజిష్ట్రారు

పి. సూర్యనారాయణ రావు నాయుడుగారిని సేల్సుటాక్సు ఆఫీసరుగా విశాఖకు వేసారు. 1 తేది వార్జీ ఇచ్చారు సమర్థనీయులైన వీరి సేవను ప్రశంసిస్తున్నాము.

### ముస్లిం లీగ్ :: నెల్లూరు

జిల్లా ముస్లిం లీగ్ యాజమాన్యమున మహమ్మద్ రఫీయుద్దీన్ అహ్మద్ అన్సారీ గారి అధ్యక్షత క్రింద ముస్లిం మహాసభ 27.3.42న జరిగింది

హిందువులకు ముస్లిములకును ఏలాటి సంబంధమునూ లేనందున ముస్లిములు అభివృద్ధికి రావలెనంటె పాకిస్థానము అత్యవసరమని మహమ్మదాలీ జిన్నా గారి నాయకత్వం అత్యవసరమని క్రిప్సు గారి రాక వలన ఈ సమస్య పరిష్కారము జాగలదని, పాకిస్థానమునకు వ్యతిరేకమైన మరి ఏవిధమైన విధానమును సూచించినను ముస్లిములు చచ్చువరకు పోరాడెదరని గడచిన పోలీసుకాల్పుల సందర్భమున చనిపోయిన పదియేండ్ల బాలుని మరణమునకు విచారపడుచూ ఈ కాల్పులు లేకుండా పోవలసి వుండెనన్నీ, కాల్పులు అనవసరమని, అవ్యక్తమని, అశాస్త్రీయమని అభిప్రాయ పడుచున్నారు. కనుక గవర్నమెంట్ వెంటనే హైకోర్టు జడ్జీ హోదాలో ఉద్యోగిని నియమించి విచారణ జరిపించవలెనని స్థానికాధికారుల చర్యల నిరసిస్తూ మిలాన్ పండుగ ఉత్సవములు ఆపివేయబడెను.

గులాం సుబేదార్,
కార్యదర్శి

## ఇదా బ్యాంకులు చేసే సేవ ?

కెనరా బ్యాంకు, "కెన్‌షెప్" అనే నూతన పథకం క్రింద పెట్టుబడులు కోరుతూ పత్రికలలో పెద్ద పెద్ద ప్రకటనలు చేసింది. ఆ స్కీంలో పెట్టుబడి పెట్టడానికి 30 వ తేది ఉదయం నెల్లూరులోని బ్యాంకు బ్రాంచికి వెళ్ళాను. అర్జీవ్రాసి, చలానా ఫారం పూర్తిచేసి, పైకంతో సహా కౌంటర్‌లోని ఉద్యోగికి అందిస్తే, ఆయన గారు గుండుసూదితో ఈ కాగితాలను కుట్టి ఇవ్వమని ముఖం మీద కొట్టినట్లు చెప్పారు.

అప్పటికే కౌంటర్ దగ్గర, నావెనుక చాలామంది ఎదురు చూస్తున్నారు. బ్యాంకు టైం అయిపోవస్తుందినది. వెనక్కు తిరిగితే, మళ్ళీ నావంతు వచ్చేసరికి సమయం ముగుస్తుంది, అందువల్ల ఆ ఉద్యోగికి నా పరిస్థితి విన్నవించినా, అతను విన్పించుకోలేదు. గుండు సూదితో చలానా ఫారం దాఖలు చేయాలనే నిబంధనకు ఈ ఒక్క సారి, వృద్ధుడనైన నాకు మినహాయింపు ఇవ్వమని ప్రక్కనే ఉన్న అధికారికి విన్నవిస్తే, ఆయనా ససేమిరా ఒప్పుకోలేదు.

ఖాతాదారులకు సేవ అని తాటికాయంత అక్షరాలతో వ్రాసుకొనే బ్యాంకులు, వినియోగదారులకు చేసే సేవ ఇదేనా ?

— పి. కృష్ణారావు.
రిటైర్డ్ డి.ఆర్.ఒ.

నెల్లూరు.

### ఎస్‌పికి అభినందన

### జనవాణి

నెల్లూరు జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ భూపతి బాబు గారు విధినిర్వహణ కోసం, స్వంత అవసరాన్ని ప్రక్కకు పెట్టిన తీరు గతవారం సణుగుడు శీర్షికలో చదివి ఆశ్చర్య పడ్డాను, ఆనంద పడ్డాను. సినిమాలలో మాత్రమే చూస్తుంటాం ఇటువంటి సంఘటనలు నిత్యజీవితంలో ఇటువంటి ఆదర్శ ప్రాయఅధికారులు తటస్థపడటం చాలా అరుదు. ఆయనకు నామనఃపూర్వక అభినందనలు .

— వై. పాలరెడ్డి

నెల్లూరు.

### గడువులు పెట్టడం ఎవరి తృప్తికోసం!

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి రెండు నెలల్లో దిగుతాడని,

కొరవ 8 పేజీలో

# లాటరీ మాయాజూదంలో కొంపలు ఆరిపోతున్నాయి!

నెల్లూరులో లాటరీల మాయా జూదం మితిమించిపోతున్నది. పూర్వపురోజుల కాటన్ మార్కెటుకు తెలిసిన మార్పులు చేసి కొందరు సంఘవిద్రోహులు నిర్వహిస్తున్న ఈ దారుణ జూదానికి పందలాది కుటుంబాలలో దీపం ఆరిపోతున్నది.

> అల్పసంపాదనపై అమిత మోజుతో వేలు తగలేసుకుంటున్నారు!

పోలీసులు, చట్టం, ప్రభుత్వం తమను ఏమీ చేయకుండా, ప్రజలను వంచించిఫురావాగా కోట్లు రేచుకొంటున్నారు. ప్రభుత్వం కూడా దీనిని 'భాగ్యలక్ష్మి పేరుతో నడుపుతూ పిండారీల రాజ్యాన్ని తలపింప జేస్తున్నది.

నెల్లూరులో దాదాపు ఏడాది క్రితం ప్రవేశించింది జూదం. చూడడానికి మామూలు లాటరీగానే కన్పిస్తున్నది. నిర్వహించేది కూడా పెద్ద పెద్ద కంపెనీలే. అయితే సాధారణ లాటరీల వలె వీటికి నిర్ణీత తేదిలో డ్రా వుండదు. ప్రతిరోజూ డ్రా తీస్తారు. అదీ, మొదటి, రెండవ బహుమతుల పద్ధతి కాదు. మొదటి బహుమతికి ఎంపిక చేసిన టికెట్ చివరి నంబరు కల్గిన అన్ని టిక్కెట్లకు బహుమతి ఇవ్వడం దీని స్పెషాలిటీ. 193454 నంబరు గల టికెటకు మొదటి బహుమతి వచ్చిందనుకోండి. 93454, 3454,454, 4 చివరి నెంబర్లుగా కల్గిన ఆ కంపెనీ టికెట్లన్నింటికీ, సిరిస్‌తో నిమిత్తం లేకుండా బహుమతులుంటాయన్న మాట. ఐదు చివరి నంబర్లు చివరగా వున్నదానికి 20 రెట్లు, మూడు నంబర్లు వుంటే 10 రెట్లు, కొన్నింటికి 8 రెట్లు కూడా వుంటాయి బహుమతులు.

ఈ టిక్కెట్ల ధరలు జాస్తి, 20 రూపాయలు కూడా వుంది కొన్నిటి రేటు. ప్రతిరోజూ మధ్యాహ్నం టెలిఫోన్ ద్వారా ఈ చివరి నంబర్ల వివరం వస్తుంది. ఉదయం ఇరవై రూపాయలు పెట్టి కొంటే, అదృష్టం బాగుంటే సాయంత్రానికి రెండువందలో, నాలుగు వందలో వచ్చేస్తుందనే ఆశతో వందలు, వేల మంది అమాయకులు ఈ జూదం మాయలో మునిగిపోతున్నారు. ఒక్క నెల్లూరే కాదు, దేశ వ్యాప్తంగా వుంది జాడ్యం.

నెల్లూరులో మధ్యాహ్నం అయ్యేసరికి ట్రంకురోడ్డు లాటరీ

కొరవ 11 పేజీలో



వేమారెడ్డి మురళీకృష్ణారెడ్డి తనయ స్మిత, బుచ్చి, ఇప్పగుంట సుబ్బరామ రెడ్డి కుమారుడు సతీష్ బి.టెక్; వీరి వివాహం ఇటీవల నెల్లూరులో జరిగింది.

# కలెక్టర్ గారూ — మీ పై కొండంత ఆశ వుంది!

మునిసిపల్ పెత్తనం కౌన్సిల్ చేతుల నుంచి కలెక్టర్ గారికి మారింది. అసమర్థత, అవినీతి, అలక్ష్యాలతో చెదలు పట్టిపోయిన పాలనను చక్కదిద్ది గాడి తప్పిన మునిసిపల్ శకటాన్ని తిరిగ పట్టాలపై పెట్టవలసిన బాధ్యత కలెక్టర్ పై పడింది.

శ్రీ కె. రాజా ఇది వరకు విశాఖపట్నం కమీషనర్‌గా పనిచేశారు. అందువల్ల మునిసిపల్ పాలనా తీరు తెన్నులు ఆయనకు సమగ్రంగా తెలిసినవే! మూడున్నరేళ్ళ నుంచి ఇక్కడే వుండడం వల్ల టౌన్ భౌగోళిక పరిస్థితులూ క్షుణ్ణంగా తెలుసు. ఈ అనుభవంతో ఆయన మునిసిపల్ నిర్వహణను సులభంగా జరిపించే అవకాశం వుంది.

పౌరులకు కలెక్టర్ పై చాలా ఆశలున్నాయి. ఎన్నికలు జరిగిన మొదట మొదట రోజులు మినహాయించి, మరీ ముఖ్యంగా గత మూడేళ్ళగా కౌన్సిల్ పట్ల ప్రజలు విసిగి పోయివున్నారు. కాంట్రాక్టులివ్వడం, పర్సంటేజీలు పంచుకోవడం తప్ప ప్రజల సమస్యల పట్ల శ్రద్ధ చూపడంలో కౌన్సిలర్లు ఘోరంగా విఫలమయ్యారు. దీని ఫలితంగా టౌన్‌లో అభివృద్ధి అనేది అవతల పెట్టండి — కనీస పౌర సౌకర్యాలూ చిందర వందరై పోయాయి.

డ్రైనేజీది ప్రధాన సమస్య. సగభాగం టౌన్‌లో మ్యాన్‌హోళ్ల నుంచి మురుగునీరు పొంగి రోడ్లపై పారుతూంది. చెత్త ఎత్తే వారు లేక వీధులు గబ్బు పట్టి పోయి వున్నాయి. సిమెంట్‌తో వేసిన వాటితో సహా రోడ్లన్నింటినీ త్రవ్వి పారేయడంతో చిన్న చిన్న సందులు సైకిళ్ల పై వెళ్ళడానికి కూడా పనికి రాకుండా పోయాయి.

ఇంకొక ప్రక్క ఆఫీసు అవినీతితో పుచ్చిపోయి వుంది. బర్త్ సర్టిఫికెట్ కావాలన్నా, ఇంటి ప్లాను కావాలన్నా, మరే పని పడినా జనాన్ని పీక్కుని తింటున్నారు. కలెక్టర్ గారు ముందు ఈ పరిస్థితిని చక్కదిద్ద వలసి వుంది. ఆఫీసుకు వచ్చే పౌరులను సిబ్బంది మర్యాదగా చూసేటట్లు, త్రిప్పి చంపకుండా పని చేసి పంపేట్లు చేయడం అవసరం. డ్రైనేజీ పొంగిందనో, కొళాయి నీళ్లలో మురుగు

## సింహపురి

నీరు వస్తుందనో ఎవరైనా ఫిర్యాదు చేస్తే తక్షణం ఆ సమస్య పరిష్కారానికి హాజరయ్యే ఉత్సాహం, చురుకుదనం సిబ్బందిలో కల్గాలి.

ఉన్న నిధులను వార్డుల వారీగా పంపకం పెట్టడం, లేదా కోరుకున్న కౌన్సిలర్‌కు ఎక్కువ మొత్తం కేటాయించడం వల్ల టౌన్‌లో అభివృద్ధి అస్తవ్యస్తంగా వుంది. పాత టౌన్‌లో సిమెంట్ రోడ్లు వేశారు; విస్తరణ ప్రాంతాలలో మట్టి రోడ్లు సైతం లేవు. కలెక్టర్ పాలనలో చక్కదిద్ద బడవలసిన ప్రధాన అంశం ఇది. టౌన్‌లో

కొరవ 11 పేజీలో



## పెనుకొండ డిస్ట్రిక్ట్ మునిసిఫ్ కోర్టులో

E P 97/90 in O.S. 14/86

M. విజయ కుమార్ – DHR, P. ఓబులేశు – J.Dr

### వేలం ప్రకటన

ఇందుమూలంగా యావన్మందికి తెలియజేయడమేమనగా క్రింద కనపరచిన స్థిరాస్థిని 8.5.92 తేదిన పగలు 10.30 గంటల నుండి సాయంత్రం 5 గంటల మధ్య కాలములో పెనుకొండ డిస్ట్రిక్ట్ కోర్టు నందు యాలము వేయుదురు. కొనదలచిన వారు పై తేదిన యాలము నందు పాల్గొనవలసినదిగా కోరడమైనది.

### షెడ్యూలు

అనంతపురం రి.డి. బుక్కపట్నం సబ్. రి.డి.లో చేరిన బుక్క పట్నం గ్రామములో యుండు Asst. No. 1340 Door No. 4/294 గల మిద్దె యిల్లు ఇందుకు చెక్కుబందులు.

తూ: రస్తా; ప: దావి, అంగజాల వెంకట రామయ్య కొట్టము; ఉ: ఓబులేశు (ప్రతివాది); ద: మంగల మారెప్ప కొట్టము. ఈ మధ్యగల తూ. ప. 7 x 6 గజాలు లేక 6.42 x 5.50 మీ గల మిద్దె యిల్లు పూరా హక్కు.

EP మొత్తము రూ. 8924. 75

5-8-85 వ తేదిన ప్రతి వాది ఓబులేశు ఒక తగదాల రామలక్ష్మమ్మ కు రూ. 4000/- లకు స్వాధీన అయకం వుంచినాడు. యిందుకు లోబడి.

P T నరసింహాచార్, P T లక్ష్మి నరసింహం,

వాది పరం వకీళ్లు, పెనుకొండ.



జిల్లాలోని కుదువ వ్యాపారులకు

### విజ్ఞప్తి

కాలపరిమితి దాటిన వస్తువులను బహిరంగ వేలము ద్వారా విక్రయించుటకు చట్టప్రకారం తీసుకోనవలసిన చర్యల నిమిత్తం నెల్లూరు, సంతపేట, 11/276, బ్రాహ్మణ వీధి నివాసి అయిన మెంటా అచ్చయ్య శెట్టి కుమారుడు శ్రీ మెంటా మోహన్ రావును తన అంగీకారముతో నా తరఫున నా యొక్క ఏజంటుగా శ్రీ జిల్లా కలెక్టరు వారికి తెలియజేసి తే. 29.02.92 ది నుండి నియమించినాను.

కనుక, జిల్లాలోని కుదువ వ్యాపారాలు వేలము వివరముల కొరకు సదరు శ్రీ మెంటా మోహన్ రావు గారిని సంప్రదించవచ్చును.

బి. వెంకటేశ్వర్లు

జిల్లా వేలముదారు (కుదువ వస్తువులు)

12/280 హాస్పిటల్ రోడ్డు, నెల్లూరు - 524 001.

చిత్రగుంట యువతి ఆత్మాహుతి

# ఈ కీచకులకు ఏది శిక్ష?

చిత్రగుంటలో 31 తేది సాయంత్రం లలిత అనే ఇరవై ఐదేళ్ల వివాహిత యువతి కిరోసిన్‌తో తన ఒంటికి తానే నిప్పంటించుకొని దారుణ మరణం చెందింది. లలిత శరీర సౌష్ఠవం కలిగిన, ఆకర్షణీయమైన యువతి. ఆమె పై ప్రక్కింటిలో వున్న మాల్యాద్రి, తిరుపతి నాయుడులనే కీచకుల కళ్లు పడ్డాయట. వారు ప్రతి నిత్యం ఆమెను వేధించే వారట. కొంత కాలం ఈ బాధలు మౌనంగా భరించింది. అయితే అది అలుసుగా తీసుకొని ఆ నర పశువులిద్దరూ ఇంట్లో దూరే సాహసం చేశారట. ఆమె భయపడిపోయి భర్తకు మొరపెట్టుకున్నదట. అతడు వీరిద్దరనీ మందలించాడట. ఆ మందలింపు వారిలో పశుత్వాన్ని మరింత రెచ్చగొట్టినట్లుంది. ప్రక్కనే వున్న హరిజన పాలెం నుంచి మరి నలుగురు నీచులను వెంట బెట్టుకొని వచ్చి, లలిత ఇంటి పై పడ్డారట. పాపమా భార్యాభర్తలు భయపడిపోయి, ప్రక్కవీధిలోని లలిత పుట్టింటికి వెళ్లి దాగుకున్నారు. వీరు అక్కడకూ వెంటబడి, నానా రభస సృష్టించారట. చూస్తున్నవారు అయ్యోపాపం అనడం తప్ప, నివారించ లేక పోయారు. అది ఈ రాక్షసులకు చులకనగా తోచి మరింత పెట్రేగినట్లున్నారు. ఆ అభాగ్య యువతి అవమానం భరించ లేక కీచకుల నేమీ ఒంటిపై కిరోసిన్ పోసుకొని, నిప్పంటించుకొని చనిపోయింది.

ఎంత దారుణ సంఘటన అది? ఎవరో ఇద్దరు నర పశువులు ఒక అమాయక యువతిని పబ్లిక్‌గా హింస పెడుతుంటే నివారించ లేనంతటి వచ్చు ప్రజలా బోగేలు వాసులు? ఎంతటి మానసిక యాతనకు గురి కానిదే ఆ నిర్భాగ్యురాలు అంతటి ఘోర మరణాన్ని ఆహ్వానిస్తుంది? ఈ దురంతానికి కారకులైన నీచులకు శిక్ష ఏమిటి? వారిని పట్టి, ఊరూరు త్రిప్పి, ఎక్కడా పచ్చి మంచి నీళ్లు పుట్టకుండా చేసి, సంఘ బహిష్కారానికి గురి చేయగల్గితే బోగేలులో ఇంకా మనుషులు నివశిస్తున్నారని ప్రపంచం నమ్ముతుంది. పోలీసులకు వదలి పెడితే జరిగేది ఏమీ వుండదు.

### రాపూరు మహిళల ఆందోళన

రాపూరులో ఏడు సంవత్సరాల నుంచి ఎంత రచ్చ చేసినా మహిళా డాక్టర్ నియామకం జరగనందుకు నిరసనగా ఇటీవల స్త్రీక్ ఇండియా మహిళావిభాగం కార్యకర్తలు ఆందోళన చేశారు. పదిరోజుల పాటు నిరాహార దీక్షలు జరిపారు.

## జిల్లా వార్తలు

### నిజానిజాలు రజతోత్సవం

కావలి నుండి వెలువడే పక్ష పత్రిక 'నిజా - నిజాలు' రజతోత్సవం 22 తేది జరిగింది. ఈ ఇరవై ఐదేళ్ళ పండుగను స్టేట్ బ్యాంక్ మేనేజరు శ్రీ కె. రామ మూర్తి అధ్యక్షించారు. డిఎస్‌పి శ్రీ కె. మాణిక్యాల రావు ముఖ్య అతిథ్యం నెరపారు. శ్రీ డి. కోదండ రామ రెడ్డి, టి. రామకృష్ణ, సి. నాగరాజారావు, ఎస్. జయప్రతాప్ రెడ్డి, కె. రాధాకృష్ణ మూర్తి, కేసరి సుందర రామ శర్మ, కె. నాగరాజారావు తదితరులు మాట్లాడారు. సంపాదకుడు శ్రీ జె. శివరాం అందరికీ వందనా లర్పించారు.

### కావలిలో డేగాకు సన్మానం

జిల్లాపరిషత్ ఛైర్మన్ శ్రీ డేగా నారసింహారెడ్డి కి జరుగుతున్న సన్మాన పరంపరలో భాగంగా కావలీయులు 22 తేది తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నారు. డాక్టర్ ప్రభాకర నాయుడు అధ్యక్షతన సభ ఖ ఖర్చు ఆయనదే. శ్రీ గొట్టి పాటి కొండప నాయుడు, డేగా పార్టీ

కొరవ 8 పేజీలో

# మూడు మునిసిపాలిటీలూ ముదనష్టమే!

జిల్లాలోని మూడు మునిసిపాలిటీలూ అధికారుల పరమైనాయి; కౌన్సిళ్ళు రద్దయి నాయి; 30 తేది సాయంత్రం ముగ్గురు ఛైర్మన్లూ నిశ్శబ్దంగా దిగిపోయారు. ఐదేళ్ళ పదవి భోగం అనుభవించిన తృప్తి వారికి వుండవచ్చు కాని, వీరి పరిపాలనలో సుఖాన్ని అనుభ వించామన్న సంతృప్తి పౌరులలో మాత్రం లేదు. అందు వల్లే కౌన్సిల్ హాళ్ళలో తామే జరుపుకున్న వీడ్కోలు సభలు తప్ప, ఆనందోత్సాహాల మధ్య పౌరుల నుంచి వీడ్కోలు అందుకోలేక పోయారు. పదవి కాలం తీరి పోయిందన్న సాను భూతి కంటె, హమ్మయ్య మునిసి పాలిటీలకు చెరవిడిందన్న సంతోషం మూడు టౌన్‌లలోనూ కన్పించింది.

శ్రీరామ మాలకొండయ్య హయాంలో, ఇంత కంటె అధ్వాన్నమైన కౌన్సిల్‌ను ఇక ఎప్పటికీ చూడబోము అనే అభిప్రాయం వుండేది నెల్లూరులో; ఇప్పటి కౌన్సిల్‌పాలన అనుభవించిన తర్వాత అప్పటిదెంత నయమో అనుకొనని వారుండరు. రమేష్ రెడ్డి, తిరుగులేని మెజారిటీతో ఛైర్మన్‌గా, ఎంపికైనపుడు వాతావరణం ఎంత ఉత్సాహ భరితంగా వుండిందో ఉత్సాహం ఉరకలు వేస్తూండేది. దానికితోడు నెల్లూరును నందన వనం చేస్తానని పదే పదే ప్రకటించే వారు.

### సంతోషం తప్ప, సానుభూతి లేదు!

చెప్పలేము. ఏ పార్టీ కౌన్సిలర్ కూడా ఛైర్మన్ మాటకు ఎదురు చెప్పలేని పరిస్థితి ఆనాటిది! రమేష్ రెడ్డి లోనూ పత్రికా ప్రకటనలలో కొత్త పథకాలు పుంఖాను పుంఖాలుగా వచ్చేవి. టౌన్

కొరవ [illegible] పేజీలో



# శ్రద్ధాంజలి

## శ్రీ తిక్కవరపు దయాకరరెడ్డి

తే 31-3-92 దిన పాండిచేరిలో పరమపదించారు. వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ పవిత్రాత్మకు శాంతి చేకూర్చాలని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

### ఉత్తరక్రియలు

అస్తినిమజ్జనం: 10-4-1992 తేది శుక్రవారం ఉదయం 8 గంటలకు అరబిందో నగర్‌లోని మా స్వగృహం నుంచి బయల్దేరి, పెన్నా నదిలో అస్తికల నిమజ్జనం జరుగుతుంది.

అదే రోజు ఉదయం 10 గంటలకు నవలాకుల తోటలోని నెల్లూరు స్టాఫోర్డ్ ఫ్యాక్టరి ఆవరణంలో శ్రద్ధాంజలి, సమారాధన జరుగుతాయి. మధ్యాహ్నం 12 గంటలకు పేదలకు అన్నదానం.

బంధుమిత్రులు శ్రేయోభిలాషు తెలియగోరుతాము

తల్లి : తిక్కవరపు కృష్ణమ్మ ; భార్య : మహాలక్ష్మమ్మ ;
కుమారులు: ఆగామి రెడ్డి, శాంతికర్ రెడ్డి; కోడళ్లు: శోభ, తారా;
మనుమలు: సత్యజిత్, వరుణ్, పవన్; మనుమరాలు: అగజ.

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## ప్రధాని రాక లేదు

ఎ.సి. స్టేడియం వద్ద ప్రతిష్ఠించనున్న రాజీవ్ గాంధీ విగ్రహానికి తిరుపతి కాంగ్రెస్ మహాసభల సందర్భంలో ఒకపూట ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు నెల్లూరు వచ్చి ఆవిష్కరించే కార్యక్రమం వున్నదను కున్నాము. దాని వల్లనే విగ్రహ పీఠం వైదా నిర్మాణాలు, రెండు వైపులలో ట్రంకురోడ్డును వెడల్పుచేయడం వంటి కార్యక్రమాలు శరవేగంతో జరుగు తుండినాయి. కాని ఇప్పుడు అధికారికంగా తెలుస్తున్న దాన్ని బట్టి ప్రధాని నెల్లూరు కార్యక్రమం లేదు. మరలా ఎప్పుడో చెప్పలేము.

రోడ్డు విశాలం చేసే పనిమాత్రం యధా ప్రకారం కొనసాగుతున్నది.

## జానకి రాం

జిల్లామంత్రి శ్రీ జానకి రాం ఈ రోజు(3 తేది) రాత్రికి నెల్లూరు వస్తారు. 4,5 తేదులలో ఉదయగిరిలో కార్యక్రమాలు. 6 తేది ఉదయం తిరుపతి వెళ్తారు.

## పెళ్లకూరుకు పదవి

శ్రీ పెళ్లకూరు రామచంద్రారెడ్డి 'ఇఫ్కో' సంస్థ డైరెక్టరుగా నియమితులయ్యారు. IFFCO అంటే ఇండియన్ ఫార్మర్స్ ఫర్టిలైజర్స్ కో-ఆపరేటివ్ సంస్థ అన్నమాట. దీని యాజమాన్యంలో దేశవ్యాప్తంగా అనేక భారీ ఎరువుల ఉత్పత్తి ఫ్యాక్టరీలు ఉన్నాయి. పెద్ద సంస్థ. పూర్వం దీని అధ్యక్షులుగా పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిగారి తమ్ముడు, నెల్లూరు అల్లుడు శ్రీ శ్రీనివాసులు రెడ్డి వుండినారు.

పెళ్లకూరుకు పాండిచ్చేరి గవర్నరు పదవి అన్నారు; రాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు అన్నారు; మొన్న మొన్న ఎ.ఐ.సి.సి. కార్యదర్శిత్వం అన్నారు; నిన్న 'ఇఫ్కో' ఛైర్మన్ పదవి అన్నారు. ఆఖరుకు డైరెక్టరు పదవి వచ్చింది. ప్రధాని పి.వి. కి సన్నిహిత అనుచరుడైనందువల్లనే ఈ వూహాగానాలు.

చిన్నదో పెద్దదో ఒక మంచి పదవి వచ్చింది; పెళ్లకూరుకు అభినందనలు.

## ఎ.ఐ.సి.సి. సభ్యులు

ఎ.ఐ.సి.సి. సభ్యులుగా శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి, ఆనం సంజీవ రెడ్డి, పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారలు నియమింప బడ్డారు.

శ్రీ జనార్ధన రెడ్డి, పెళ్లకూరు లకు ఈ సభ్యత్వం మొదటి పర్యాయం. ఆనం సంజీవ రెడ్డి గారికి అది పర్మనెంటు అయింది. ఆయన ఇందిరా కాంగ్రెస్‌కు విడాకులిచ్చిపోయినా, అది మాత్రం ఆయన్ను వదల లేదు. ఋణానుబంధం!

## నెల్లూరు టౌన్‌లోనూ నక్సల్స్ సంచారం

రాపూరు కొండ క్రింద పల్లెల్లో నక్సలైట్లు తిరుగాడుతున్నారంటేనే భయపడిపోయిన జిల్లా ప్రజానీకం - ఇప్పుడు ఏకంగా నెల్లూరు టౌన్ లోనే వారు మకాం పెట్టిన వార్త విని కలవరపడి పోతున్నది. కలువాయి దగ్గర చింతలపాళెం లోని ఎన్‌కౌంటర్‌లో దొరికిన ఇద్దరు నక్సలైట్ల ఆరెస్టుకు నిరసనగా వెంకటేశ్వర హాలు సమీపంలోని వ్యవసాయ శాఖ కార్యాలయం జీపు తగుల బెట్టారు. ఆ ఆఫీసుకు, నాలుగవ టౌన్ పోలీస్ స్టేషనుకు ఫర్లాంగు దూరం ఉండదు. చాటున వుండడం వల్ల, స్టేషనుకు దగ్గరైనా దాన్ని ఎంపిక చేసుకున్నట్లున్నారు వారు.

ఇతర జిల్లాలనుంచి కీలకమైన తీవ్రవాదులు కొందరు నెల్లూరు చేరు కున్నారని వినికిడి. వీరు జిల్లాలో కార్యకలాపాలు చేపట్టడానికి వచ్చారో లేక తిరుపతి ప్లీనరీ దృష్టిలో పెట్టుకొని తాత్కాలికంగా తరలి వచ్చారో తెలియదు.

పెద్దగా అడవుల రక్షణ, సామాజిక దోపిడి, బలహీన వర్గాల ప్రజల వేధింపు, రైతు కూలీల మధ్య ఎడబాటు లేని నెల్లూరు జిల్లాలో నక్సలైట్ల ఉద్యమ వ్యాప్తి అంత సులభమని భావించలేము. కాని గెరిల్లా పద్ధతిలో జరిగే దాడులు, దహనాలను నివారించడం పోలీసుకు పెద్దసవాలు క్రింద లెక్క.

## సోమశిల స్వాహా - పేమెంట్ నిలుపుదల !

గత వారం జమీన్‌రైతులో ప్రచురితమైన సోమశిల నిధుల స్వాహా పై ప్రభుత్వం ప్రతిస్పందించింది. హైదరాబాద్ నుంచి విచారణాధికారులు వచ్చారు. అన్ని పేమెంట్లు నిలపమని ఉత్తర్వులు చేశారు. ముఖ్యమంత్రి స్వయంగా ఈ కుంభకోణం వార్తపై వాస్తవాలు పరిశీలిస్తున్నట్లు వినికిడి.

## 'స్వాహాతోనాకు సంబంధం లేదు'

సోమశిల నిధుల స్వాహాతో తన కెటువంటి సంబంధం లేదని ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ సుందర రామరెడ్డి కుమారుడు శ్రీ బి. రాఘవేంద్ర రెడ్డి వివరణ పంపారు. తాను ఈ ప్రాజెక్టులో కాంట్రాక్టరే అయినప్పటికీ, ఒక పెద్ద పనికి అగ్రిమెంట్ చేసుకొని వున్నప్పటికీ, ఆరోపణలకు గురైన ఈ పనులతో తనకు సంబంధం లేదని; ఒక్క పనికూడా తాను తీసుకోలేదని; సిండికేట్ నడపలేదని ఆయన చెప్తున్నారు. సోమశిలలోని ఇతర విభాగాలలో తన పేరు పై వున్న ఒకటి రెండు చిన్న చిన్న పనులు ఈ స్వాహా క్రిందకు రావని కూడా చెప్పాడా యువకుడు. అధికారంలో వున్నవారు స్నేహితులకోసమైనా తమ పేరుతో నామినేషన్లు తీసుకోవడం ప్రమాదం కాదా?.

## మరణం

నెల్లూరు స్టా బోర్డ్సు అధిపతి శ్రీ తిక్కవరపు దయాకర్ రెడ్డి అస్వస్థులై మద్రాసులో చికిత్స పొందుతూ డాక్టర్ల సెలవి విరవడంతో పాండిచ్చేరికి తరలింపబడి అక్కడే 31 తేది మరణించారు. ఆయనకు 86 ఏళ్ల వృద్ధమాత, భార్య, ఇద్దరు కుమారులు వున్నారు. ఆయన అంత్య క్రియలు పాండిచ్చేరిలో జరిగాయి.

శ్రీ దయాకర్ రెడ్డికి ఇరవై ఏళ్ల క్రితం గుండెపోటు వచ్చింది. కోలుకొని ఆరోగ్యం గానే వుంటుండినారు. ఈసారి హృద్రోగం తోబాటు, మూత్రపిండాలు కూడా పనిజేయ లేదట.

దయాకర్ రెడ్డి స్వగ్రామం నెల్లూరు ప్రక్కనున్న పొట్టెపాళెం. తిక్కవరపు రామి రెడ్డి గారు - దయాకర్ రెడ్డి తండ్రి చిన రామి రెడ్డి అన్నదమ్ముల కుమారులు. చిన రామి రెడ్డి గారు దాదాపు అరవై ఏళ్ల క్రితం విరాగియై కుటుంబంతోటి పాండిచ్చేరి పోయి, సత్య కర్మగా పేరు మార్చుకొని అరవిందుని శుశ్రూషతో అక్కడే స్థిరపడి 1965 ప్రాంతంలో దివంగతులైనారు. ఆయన సతీమణి శ్రీమతి కృష్ణమ్మ అక్కడే వుంటున్నది. దయాకర్ రెడ్డి కుమారులలో ఒకరు ఆమె తోటి పాండిచ్చేరిలో వుండగా, మరొకరు అమెరికాలో ఇంజనీరుగా వున్నారు. దయాకర్ రెడ్డి అల్లూరు - కీ.శే. పొణకా చంద్రశేఖర్ రెడ్డి (అబ్బయ్య రెడ్డి) అల్లుడు. ఆయన పొట్టెపాళెం సర్పంచ్‌గా, నరసింహాలు కొండ ఆలయ పాలక వర్గ ఛైర్మన్‌గా వుండినారు. ఆయన ఛైర్మన్‌గా వున్నప్పుడే తన సొంత ఖర్చుతో కొండ మీద నీటి వసతి కల్పించారు. దయాకర్ రెడ్డి గారి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## మునిసిపాలిటీలు

(5వ పేజీ కొరవ)

నడిమి భాగంలో సిమెంట్ రోడ్డు పని, మొత్తం టౌనంతా వీధి దీపాల కళ వచ్చే సరికి, ఇంకేముంది నెల్లూరు బాగు పడి పోయిందని నమ్మారందరూ! కాని ఐదేళ్ళ తర్వాత ఇప్పుడొక సారి వెనక్కు చూచుకొంటే కన్పడేది నందన వనం కాదు.

ప్రత్యక్ష నరకం; దారుణమైన ఆశాభంగం. ఈ ఐదేళ్లలో ప్రవర్తించినంత చవక బారుగా, అవినీతి మయంగా మునిసిపల్ చరిత్రలో ఎప్పుడూ ఏ కౌన్సిలర్లూ ప్రవర్తించి వుండరు. మునిసిపాలిటీని పబ్లిక్‌గా అమ్మకానికి పెట్టి, దొంగలు ఊళ్లు పంచుకున్నట్లు నిధులు పంచుకొన్నారు. ఈ పంపకాలెంత నిస్సిగ్గుగా జరిగాయంటే, వాటాలు కుదరక ఐదేళ్ల కాలంలో కనీసం టీచరు పోస్టులనూ భర్తీ చేయలేక పోయారు; అవినీతి వల్లనే ఒక్క కౌన్సిలరూ సిబ్బందిని అదుపు చేసే పరిస్థితి తెచ్చుకోలేక పోయారు. ఇటు ప్రజల దృష్టిలో, అటు అధికారుల దృష్టిలో చులకనై పోయారు. కాంట్రాక్టు బిల్లుల పుస్తకాలు పట్టుకొని క్లర్కుల టేబిళ్ల దగ్గర నిలబడే కౌన్సిలర్లకు ఏమి విలువ వుంటుంది!

కావలి మునిసిపాలిటీ పరిస్థితి మరీ అన్యాయం. 20 లక్షల మిగులుబడ్జెట్‌తో అధికారంలోకి వచ్చిన కౌన్సిల్, జీతాలు, కరెంట్ బిల్లులు చెల్లించలేని దయనీయ స్థితిలో నిష్క్రమించింది. చివరి రోజు కూడా హాలులో చేరి తమ ఇష్టం వచ్చినట్లు తీర్మానాలు వ్రాస్తుండిన కౌన్సిలర్లను మెడపట్టి బయటకు గెంటినంత పనిచేసి, మినిట్స్ పుస్తకం పెరుక్కున్నారు అధికారులు. వీడ్కోలు కోసం ఏర్పాటు చేసిన టీ కూడా త్రాగనివ్వకుండాతరిమేశారు.

గూడూరే కొంత నయం. రాజకీయ రభసవున్నా అవినీతి విషయంలో ఇంత పతనం కాలేదు. ఏమీ తెలియని సాధారణ యువతి అయినా, ఛైర్ పర్సన్ శ్రీ మతి పద్మావతి హుందాగా, ఆరోపణలకు గురి కాకుండా పదవీ విరమణ చేసింది.

మూడు మునిసిపాలిటీల ఆర్థిక పరిస్థితులు, కౌన్సిళ్ల పాలనలో టౌన్ తీరు తెన్నులు మరొకసారి ముచ్చటించుకుందాం!





శ్రద్ధాంజలి

పొణకా బాబు రెడ్డి గారు

29.3.92 ఆదివారం

హైదరాబాదులో

దివంగతులైనారు. వారి ఆత్మకు శాంతి కలగాలని భగవంతుని

ప్రార్థిస్తూ

కుమారుడు : పొణకా ప్రభాకర రెడ్డి

కుమార్తెలు – అల్లుళ్లు

# ఉన్నత విద్యా శుభాకాంక్షలు



మాకు మంచి మిత్రుడు

## డాక్టర్ గడ్డం కుమార్ రెడ్డి, M.S. (Ortho)

ఎముకల శస్త్ర చికిత్సలో ఉన్నత విద్యకై 5.4.92 తేది ఇంగ్లాండుకు బయలుదేరి వెళుతున్న
శుభ సందర్భంలో ఉన్నత విద్యావంతుడై, గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందాలని
ఆకాంక్షిస్తూ, అందజేస్తున్నాము
శుభాకాంక్షలతో మిత్రులు

<table>
<tr><td>కె. శ్రీధర రెడ్డి<br>హోటల్ న్యూ మంజు A/c<br>రాధా థియేటర్ ఎదురుగా, నెల్లూరు</td><td>సి. హెచ్. రమేష్<br>శ్రీ భారతి బుక్ సెంటర్ & ఆటో జెరాక్స్<br>జి.ఎన్.టి. రోడ్డు, నెల్లూరు</td><td>ఎస్. సదాతుల్లా ఖాన్<br>నెల్లూరు ఏజెన్సీస్<br>చిన్న బజార్, నెల్లూరు</td></tr>
<tr><td>కె. సూర్యప్రతాప్ రెడ్డి<br>హోటల్ అనురాగ్<br>వి.ఆర్ కాలేజీ దగ్గర, నెల్లూరు</td><td>ఎ. సుబ్బారెడ్డి<br>నెల్లూరు ఫార్మాసీ<br>ట్రంక్ రోడ్డు, నెల్లూరు</td><td>యం.డి. రవూఫ్<br>యం.డి.ఆర్. ఫ్రూట్ కో.<br>చిన్న బజార్, నెల్లూరు</td></tr>
<tr><td>డి. రవి కుమార్<br>మురళీ కూల్‌డ్రింక్స్<br>హెడ్‌పోస్టాఫీసు దగ్గర, నెల్లూరు</td><td>ఇ. కృష్ణారెడ్డి<br>ఇ.కె.ఆర్. ట్రేడర్స్<br>లజ్ కార్నర్, మద్రాసు</td><td>కృష్ణా కన్‌స్ట్రక్షన్స్<br>మద్రాసు</td></tr>
<tr><td>పి. లక్ష్మీ నరసారెడ్డి<br>ఫైనాన్షియర్<br>టెక్కేమిట్ట, నెల్లూరు</td><td>సి. హెచ్.జె. రెడ్డి<br>సర్తనందన చిట్స్ & ఫైనాన్స్ ప్రై. లి.<br>స్వప్నా లాక్, సికింద్రాబాద్</td><td>ఎస్.వి. సుబ్బారెడ్డి<br>హైదరాబాద్</td></tr>
<tr><td>యం. చంద్రమౌళి రెడ్డి<br>ఛైర్మెన్<br>వేణుగోపాలస్వామి దేవస్థానం, నెల్లూరు</td><td>జి.పి. రెడ్డి<br>మురళీకృష్ణ ఫైనాన్షియర్స్<br>సిద్ధార్థ టవర్స్, నెల్లూరు</td><td>బి. ప్రవీణ్ కుమార్ రెడ్డి<br>దీపిక ఫైనాన్షియర్స్<br>బృందావనం, నెల్లూరు</td></tr>
<tr><td>వి. రవీంద్ర<br>స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా<br>నెల్లూరు</td><td>ఆనం మహేష్<br>సి.యల్.యన్. రెడ్డి<br>ఎస్. శివ కుమార్ రెడ్డి</td><td>ఎస్. శ్రీధర్ రెడ్డి<br>యమ్. రవీంద్ర రెడ్డి<br>కె. శ్రీనివాసులు రెడ్డి</td></tr>
</table>

## ఎన్టీఆర్

దబ్బుకోసం పార్టీని పణంగా పెట్టి కాంగ్రెస్‌తో లాలూచి పడ్డారన్న నిందను మాపుకోవడం ఆయన తరం కాదు. ఇప్పటికే మల్లెలబాబ్జీ నాటకం, హత్యలలో ఎన్టీఆర్ పాత్ర వుందన్న సందేహాలు ప్రజలలో విస్తర్తాయి. ఇంకోక ప్రక్క అధికారం పోగానే తెలుగువేశాన్ని గాలికి వదలి డబ్బు సంపాదన కోసం సినిమా తీసుకుంటున్నాడన్న అసంతృప్తి వుంది; ఉపేంద్ర, భూపతి రాజుల పార్టీని నిలువుల చీల్చడంతో ఢిల్లీలో ప్రతి పక్షనాయకుల దగ్గర మాట చలామణీ ఆగిపోయింది; ఇప్పుడు ఇన్సూరెన్స్ వివాదం వచ్చిపడింది. ఎన్టీఆర్‌ని జాలి పడాల్సిన పరిస్థితి!

* * *

అసెంబ్లీ సమావేశాలు ముగిశాయి. ముఖ్యమంత్రిని ఇబ్బంది పెట్టాలనుకొన్న ప్రతి పక్షం పథకాలు, అసమ్మతీయుల ప్రోత్సాహాలు విఫలమైనాయి. తాననుకున్న ప్రకారం, అనుకున్న బిల్లులను ఏ మాత్రం కష్టం లేకుండా ఆమోదింప జేసుకున్నారు శ్రీ జనార్దన రెడ్డి. ఎంతో వివాదాస్పదమైన ప్రైవేటు కాలేజి రొనేషన్ల బిల్లు సైతం చట్టంగా మారింది.

సమావేశాల సమయంలో ప్రతి పక్షాలు వేసిన దాడులు త్రిప్పి

(మొదటి పేజీ కొరవ)

కొట్టడంలో కూడా ముఖ్యమంత్రి తన రాజకీయ చతురత పాటించారు. కాంగ్రెస్ మంత్రులు, ఎమ్మెల్యేలచేత ప్రతి దశలోనూ ప్రతి దాడులు జరిపించి సమస్యల్లో పడకుండా తప్పించు కున్నారు. ప్రతిపక్షం ఎన్ని ఆరోపణలు చేసినా, ఒక్క విందకైనా న్యాయ విచారణ వంటి దిశాకు లేకుండా చేసుకున్నారు. ఇది ఒక రకంగా ముఖ్యమంత్రికి వ్యక్తి గత రాజకీయ విజయమే.

## సోలంకీ

(మొదటి పేజీ కొరవ)

రాజీనామా చేసేశారు. పి.వి. చేయించారనడం నమ్మజనమేమో.

ఇంత పెద్ద దేశానికి చెందిన విదేశాంగ మంత్రి దారిన పోయే దానయ్య ఇచ్చే జాబులు మోసుకొని వెళ్ళి డెలివరి ఇస్తాడా? అతి బలహీనంగా వున్న ఈ అబద్ధాన్ని ప్రతిపక్షమేకాదు - ప్రజలూ నమ్మలేక పోతున్నారు. రాజీనామాతో సరి పెట్టకుండా, ఆజాబు కర్త ఎవరో, బయట పెట్టడం ప్రధాని విధి. లేకుంటే ప్రజల మనసులలో ఏర్పడిన అనుమానాలు తొలగిపోవు.

## జనవాణి

3 పేజీ కొరవ

మూడునెలల్లో ఇంటికి వెళతారని కాంగ్రెస్‌కే చెందిన నాయకులు గడువు విధిస్తూ ప్రకటనలు చేయడం దురదృష్టకరం. వారి ఆత్మ తృప్తికోసం తప్ప, పార్టీమేలు, ప్రజల మేలుకోరి చేసే ప్రకటనలు కావివి. 1978-83 ల మధ్య చీటికి మాటికి ముఖ్యమంత్రులను మార్చి కాంగ్రెస్ ఎంత రోత పట్టిందో; తెలుగు దేశం వంటి ప్ర్యాదల్ భావాలు కల్గిన పార్టీని ప్రజలు వరించడానికి ఎట్లా కారణమయిందో స్వయంగాచూశాం. మళ్ళా అటువంటి చేటు కాలం, చేదు అనుభవాలు పునరావృతం కాకముందే కాంగ్రెస్ నాయకులు కళ్ళు తెరవాలి; వ్యక్తిగత స్పర్థలకు పార్టీని బలిచేసే ప్రకటనలు, ప్రయత్నాలు మానాలి.

ఎస్.కె. గౌస్‌మొహిద్దీన్

నెల్లూరు.

### తోటపల్లి గూడూరు మండలం రద్దు వద్దు

ఇరవై రెండు పంచాయితీలతో, లక్ష జనాభాతో వున్న మా తోటపల్లి గూడూరు మండలాన్ని రద్దుచేసి, ఇందుకూరు పేట మండలంలో కలుపుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. ఇదే నిజమైతే ఆ ప్రయత్నం మానుకొమ్మని మనవి. అది ఇరవై రెండు గ్రామాల ప్రజలను ఇబ్బంది పెట్టడమే అవుతుంది. ఈ మండలాన్ని వుంచడం వీలుగాక పోతే, నెల్లూరు మండలంలో చేర్చినా మేలు. ఇందుకూరు పేటకో, ముత్తుకూరుకో కలిపితే రవాణా సదుపాయం లేక ప్రజలు అల్లాడి పోతారు.

— అల్లూరు సురేంద్రరెడ్డి

పాపిరెడ్డి పాళెం.

## జిల్లావార్తలు

రహితంగా పరిపాలించి అజాత శత్రు వన్పించుకున్నా రన్నారు.

సభలో నిలయ విద్వాం సుల వాద్య బృందం – ఎన్.సి. సోమిరెడ్డి, చేగూరి బాబూ రావులతో పాటు, కావలి నాయ కులు ఎం.వి. నారాయణ, గంభం విజయ రామిరెడ్డి, కంచర్ల భాస్కర్ అన్నదాత మణి తదితరులు యధాశక్తి దేగాను స్తుతించారు. శాలువలు, పూలమాలల వర్షం కురిపించారు. ఆ వరుస చూస్తే డేగా ఎక్కడ పూలమాలల క్రింద కప్ప బడి పోతాడో నని భయం వేసింది. శ్రీ షేక్ మస్తాన్ వందనాలు చెప్పారు.

### గంగపట్నంలో చెరకు తోట దగ్ధం

ఇందుకూరు పేట మండలం గంగపట్నంలో కొండూరు సుధాకర రెడ్డి అనే రైతు చెరకు తోటకు 11 తేదీ నిప్పంటుకున్నది. నెల్లూరు నుండి వచ్చిన ఫైరింజన్ మంటలను ఆర్పింది.

అదే సమయంలో గంగపట్నం నుండి రాముడు పాళెంకు గడ్డితోలటు వుండిన ఒక ట్రాక్టరుకు కరెంట్ తీగలు తగిలి మంటలు లేచాయి సమయానికి అక్కడే ఫైరింజన్ వుండడంతో, ఆ మంటలను ఆర్పి ట్రాక్టరు పూర్తిగా తగల బడకుండా కాపాడ గలిగారు.

గాలిలో వేలాడుతున్న కరెంట్ తీగలే ఈ ప్రమాదానికి కారణమట. విద్యుత్ శాఖ అధికారుల దృష్టికి రాలేదా ?

## పంచాంగం

**ఉగాది**

ఏప్రెల్ 4 తేదీ శనివారము ఉగాది పర్వ దినము అంగీరస సంవత్సరారంభము

**ఏప్రెల్ నెల తిధులు**

చైత్రశుద్ధ:

తే 4 శని పాడ్యమి ఉ. గ.10.20 వ
తే 5 ఆది విదియ ఉ.గ. 10.13 వ
తే 6 సోమ తదియ ఉ.గ. 9.35 వ
తే 7 మంగళ చతుర్థి ఉ.గ. 8.28 వ
తే 8 బుధ పంచమి ఉ.గ. 7.00 వ

తరువాత పూర్తి షష్టి

తే 9 గురు సప్తమి రా.గ. 3.15 వ
తే 10 శుక్ర అష్టమి రా.గ. 12.46 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

# కోదండరామిరెడ్డి మంచి నిర్ణయం!

నెల్లూరీయుడు ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం నెరపి "నిప్పురవ్వ" చిత్రంలో బాలకృష్ణ విజయశాంతి నాయికా నాయకులు. నాగార్జునతో వి.ఎం.సి. ప్రొడక్షన్స్ చిత్రం. వెంకటేష్‌తో రాశీ మూవీస్ చిత్రం. కాక ఈ ఏడు చిరంజీవితో ఒక చిత్రాన్ని కూడా కోదండరామిరెడ్డి తీయబోతున్నారు. ఇకపైన ఎక్కువ సినిమాలు చేపట్టకుండా వీలైనంత వరకు తగ్గించుకుని, సంవత్సరానికి మూడు నాలుగు చిత్రాలే రూపొందించాలనే ఆదర్శప్రాయమైన నిర్ణయం తీసుకున్నారు కోదండరామిరెడ్డి.

### దాసరి ముఖస్తుతి

మైక్ ముందుకు వచ్చారంటే చాలు - దాసరి నారాయణరావు విజృంభించేస్తారు! ఆయన ఏ సమయంలో ఎవరిని ఆకాశానికి ఎత్తేస్తారో, ఎవరిని అధఃపాతాళానికి తొక్కేస్తారో ఎవరికీ తెలీదు. ఇటీవల ఆయన " కొబ్బరి బొండాం" చిత్ర శతదినోత్సవంలో ఆ చిత్రం హీరో రాజేంద్రప్రసాద్‌ను మునగచెట్టు ఎక్కించేశారు. "రాజేంద్రప్రసాద్‌లో నాకు రాజ్‌కపూర్ కనిపిస్తాడు" అని దాసరి వేదిక మీద అనడం చాలామందికి శృతి మించినట్లు అనిపించింది. రాజేంద్రప్రసాద్ తెలుగులో చక్కని నటుడే. కాని, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన రాజ్‌కపూర్ ముందు అతనెక్కడ? ఇటీవల దాసరి మాటలు, చేతలు విడ్డూరంగా ఉంటున్నాయి. "వార్తల్లో వ్యక్తి"గా ప్రతి పత్రికలోనూ తన ఫోటో, తన గురించి న్యూస్ పడడానికి ఆయన పడే తాపత్రయం అంతా ఇంతా కాదు.

♣



మొగుడూ పెళ్ళాల దొంగాట చిత్రంలో నరేష్, దివ్యవాణి

## తెలుగు చిత్రాలకు రాయితీలా?

మన గర్త మీదే తెలుగు సినిమా తీశామన్న తృప్తి తప్ప - తెలుగు సినిమా రంగాన్ని హైదరాబాద్‌కు తరలించడం వల్ల రాష్ట్ర ప్రభుత్వానికి గాని, తెలుగు ప్రేక్షకులకు గాని ప్రత్యేకంగా ఒరిగేదేమీ లేదు. మద్రాసులో తీసినా, మరే రాష్ట్రంలో తీసినా తెలుగు చిత్రాలను చూసేది తెలుగు ప్రేక్షకులే. అలాగే ఎక్కడ తీసినా వినోదపు పన్ను అందేది మన రాష్ట్రప్రభుత్వానికే. ఇక, నిర్మాతల పరంగా ఆలోచిస్తే, అవ్వవడికిన నూలు తాత మొలతాడుకు సరి - అన్నట్లు ప్రభుత్వం ఇచ్చే రాయితీల కన్నా ఎదురౌతున్న వ్యయప్రయాసలు ఎన్నో రెట్లు ఎక్కువైనా ఘనస్తుతానికి నిర్మాతలు ఎలాగో అడ్జస్ట్ అవుతున్నారు. క్వాలిటీకి కాంప్రమైస్ అవుతున్నారు. అసలింతకీ ఈ రాయితీలు మునిసిపాలిటీల ఆదాయం నుంచి కోత పెట్టిఇస్తున్నవే. దానికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం మరో రూపంలో మునిసిపాలిటీలకు వనరులు సర్దుబాటు చేయాలి. చిత్రాలకు రాయితీల రూపంలో చేసే ఈ వ్యయాన్ని మన రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి, నిరక్షరాస్యత, మంచినీటి ఎద్దడి వంటి ఉపయోగకర ప్రాజెక్టులపై ప్రభుత్వం ఖర్చుపెట్టవచ్చు కదా అని మరొక వర్గం వారి ప్రశ్న. ఇది శేష ప్రశ్నే.

# రజనీకాంత్ గురుభక్తి ఎందరి కుంటుంది?

డైరెక్టర్ ఎస్. బాలచందర్ పరిచయం చేసిన రజనీకాంత్ ఆకాశమంతెత్తుకు ఎదిగిపోయాడు. రజనీకాంత్ గాని, కమలహాసన్‌గాని బాలచందర్ ఎప్పుడు కాల్‌షీట్లు అడిగినా ఇవ్వడానికి సిద్ధమే. కాని, బాలచందర్‌ది అలా అడిగే స్వభావం కాదు. ఈ మధ్య ఆయన తీసిన చిత్రాలు అంత బాగా ఆడడంలేదు. ఆయన తన ఇంటిని అమ్మకానికి పెట్టబోతున్నాడన్న వార్త రజనీకాంత్‌కు తెలిసింది. వెంటనే తన గురువుగారికి ఫోన్ చేసి, " నేను మీకు ఒక చిత్రాన్ని చేస్తున్నాను. ఎప్పట్నుంచి కాల్‌షీట్లు కావాలి?" అని అడిగేసరికి బాలచందర్ ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. రజనీకాంత్ చిత్రమంటే కోటిరూపాయలకు పైగా బిజినెస్ చేస్తుంది. బాలచందర్ సరేనన్నాడు. కథ ఎంపిక చేయడం నుంచి అన్ని విషయాలూ రజనీకాంతే చూసుకుంటున్నాడు. ఆ చిత్రం పేరు "అణ్ణామలై". రజనీకాంత్‌లాగా అంతటి కృతజ్ఞతాభావం గల నటులు నేడు అపురూపం కదా?

### దర్శకుడుగా కృష్ణంరాజు

కృష్ణ, కృష్ణంరాజు ఇక దర్శకత్వం మీద దృష్టి కేంద్రీకరించాల్సిందే. కృష్ణంరాజు "దేవుడు" చిత్రం తర్వాత "బారిస్టర్ పార్వతీశం" చిత్రం తీస్తారు. ఆ తర్వాత "విశాల నేత్రాలు" చిత్రం రూపొందిస్తారట.



### బూతుల ఘాటు లేకుంటే మరింత బాగా వుండేది!

# సీతారత్నం గారి అబ్బాయి

### చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

చిత్రం చివరన కాస్త పట్టుతప్పినా మొత్తం మీద బాగుంది. దీనికి ముఖ్య కారణం దర్శకుడు ఇ.వి.వి. సత్యనారాయణ. కుటుంబ పరమైన కథను ఎన్నుకోవడంలోను, అందునా పల్లెటూరు వాతావరణం తో కూడుకున్న కథను ఎన్నుకోవటం లోనే దర్శకుడు విజయం సాధించాడు. ప్రతి విషయం లోను శ్రద్ధ కనబరచాడు. పాత్రలకు సరితూగే నటీనటులను ఎన్నుకున్నాడు. స్క్రీన్ ప్లే చక్కగా వ్రాసుకున్నాడు. ప్రతి సన్నివేశాన్నీ పటిష్టంగా రూపొందించాడు. నటులు కనిపించకుండా పాత్రలు కనిపించేట్టు నటీనటుల చేత నటింపచేశాడు. యల్.బి. శ్రీ రాం చేత చిత్రానికి బలం కూర్చేవిధంగా మాటలు వ్రాయించుకున్నాడు. వేటూరి, సీతారామశాస్త్రుల చేత సన్నివేశానికి సరిపడే పాటలు సంగీత సాహిత్య పరంగా వ్రాయించుకో గలిగాడు. "పనివాడో ఏమిటో ఆ పైవాడు తను చేసిన బొమ్మలతో తలబడతాడు" నేపథ్యం పాట తలమానికంగా వుంది. కాని రాజ్‌– కోటీల చేత కొత్త బాణీలు వినిపించి వుంటే బాగుండేది. శ్రీనివాసులు రెడ్డి కెమెరా ద్వారా ప్రకృతి దృశ్యాలను ఆకర్షణీయంగా చిత్రించ చేశాడు. ఇలా ప్రతి విషయంలోను దర్శకుడు శ్రద్ధా సక్తులు చూపటం వల్లనే చిత్రం బాగా తయారైంది.

బరువైన సెంటిమెంట్‌తో కూడిన కథలో ఆ బరువు తగ్గించి ప్రేక్షకులను ఆనంద పరిచేందుకు హాస్యం, శృంగారం, కరుణ సమపాళ్ళలో అందించాడు. కాని హాస్యం పేర అక్కడక్కడా ద్వంద్వార్థ మాటలను వల్లించటం క్షమార్హంగా కనిపించలేదు.

సీతారత్నం గారి అబ్బాయి ఆమె సొంత అబ్బాయి కాదు. ఆమె సవతి సుమిత్ర కుమారుడు. ఆ విషయం సీతారత్నంకు తెలియదు. ఈ అబ్బాయి పేరు వంశీ. ఇతను పట్టణం నుంచి బ్యాంక్ ఆఫీసరుగా పల్లెటూరి బ్రాంచికి బదిలీ అవుతాడు. సీతారత్నం ఇంట్లో బాడుగకు చేరుతాడు. సీతారత్నంకు పిల్లలు లేరు. అందువల్ల వంశీని తన కుమారుడి లా చూసుకుంటుంది.

సీతారత్నంకు పిల్లలు లేకుండా పోవడానికి కారణముంది. ఆమె సూర్యారావుకు రెండవ భార్య. సూర్యారావుకు ఇది వరకే సుమిత్రతో ఒక విచిత్ర సన్నివేశంలో పెళ్ళయిందని, తనను రెండవ భార్యగా చేసు

కొరవ 11 పేజీలో

# లారీ యజమానులపై జాలి చూపండి!

దొంగ ఆర్‌సి పుస్తకాలు కల్గిన లారీ యజమానులను పోలీసులు దొంగలవలె చూడటం మానుకొని, జాలి చూపాలని జిల్లా లారీ యజమానుల సంఘాధ్యక్షుడు శ్రీ ఆర్. నాగేంద్ర రావు విజ్ఞప్తి చేస్తున్నారు.

"పలు లారీలకు దొంగ ఆర్‌సి పుస్తకాలున్న మాట నిజమే; కాని, పదేళ్ళకు పై బడిన లారీలకు ఇన్సూరెన్స్ కంపెనీలు పాలసీలు తీసుకోకపోవడం, తత్ఫలితంగా ఫైనాన్సు కంపెనీలు అప్పు ఇవ్వడానికి నిరాకరించడంతో పేద లారీ యజమానులు కొందరు ఒరిజినల్ ఆర్‌సి పుస్తకాలని నమ్మి వీటిని కొనుగోలు చేశారు. ఆర్‌టిఒ ఆఫీసులో వాటిని దాఖలు చేసినపుడు ఎవరూ అభ్యంతర పెట్టలేదు. ఈ పుస్తకాలను పన్నెండు నుంచి 20 వేలకు కూడా కొన్న వారున్నారు. అయితే బోగస్ ముఠా ఒకటి దొంగ పుస్తకాలతో లారీ యజమానులను మోసం చేసిందని ఇప్పుడు రుజువవుతున్నది. ఆర్‌సి పుస్తకాలు దొంగవే కాని, ఏ లారీ కూడా దొంగలించినది కాదు; ఫోర్జరీ పుస్తకాలని తెలియగానే పలువురు భయపడి, తమ లారీలను 40,50 వేలు తగ్గించి అమ్మేశారు. ఇటు లారీ పోయి, అటు నష్టపడి జీవనోపాధి కోల్పోయి సర్వనాశనమైపోయారు. ఈ పరిస్థితులలో లారీ యజమానులపై సానుభూతి చూపి, ఫోర్జరీ పుస్తకాలు అమ్మిన ముఠాను పట్టుకోవాలని పోలీసులకు మా విజ్ఞప్తి"! అది శ్రీ నాగేంద్ర రావు ప్రకటన. ఆయన విజ్ఞప్తి సానుభూతితో పరిశీలించ దగినది గానే వుంది.

## నెల్లూరు సంగతులు

### రోటరీ చక్కెర వ్యాధి చికిత్స

నెల్లూరు రోటరీ క్లబ్ మార్చి 22 తేది మధుమేహ వ్యాధి గ్రస్తులకు ఉచిత చికిత్సా శిబిరం నిర్వహించింది. 250 మంది రోగులను పరీక్షించి, కంప్యూటర్‌తో వ్యాధి నిర్ధారణ చేసి, ఉచితంగా మందులూ ఇచ్చారు. డాక్టర్ అనిల్ కుమార్ రెడ్డి, డాక్టర్ ప్రమీల, డాక్టర్ గోపాల రావు వైద్య పరీక్షలు నిర్వహించారు. ఈశిబిరంలో పాలు పంచుకున్న యు.ఎస్. విటమిన్స్ కంపెనీ రీజినల్ మేనేజర్ శ్రీ మధుకర్ కొల్హాలి, మేనేజర్ శ్రీ నారాయణన్, రోటరీ కార్యదర్శి శ్రీ డి.సి. హరిబాబు, రొటేరియన్లు డాక్టర్ వెంకట రామిరెడ్డి, శ్రీ బాలసుబ్రహ్మణ్యం, జివిశ రెడ్డి, వివికృష్ణారెడ్డి తదితరులు పాల్గొన్నారు. రోటరీ అధ్యక్షుడు శ్రీ కొండా బలరామరెడ్డి శిబిర సభను అధ్యక్షించారు.

### సూపర్ స్టార్స్ క్లబ్ షటిల్ పోటీలు

నవాబుపేటలోని సూపర్ స్టార్స్ షటిల్ క్లబ్ 10 రోజుల పాటు షటిల్ పోటీలు నిర్వహించింది. 1 తేది బహుమతి ప్రదానోత్సవం. క్లబ్ అధ్యక్షుడు శ్రీ పివి సుబ్బారెడ్డి అధ్యక్షించారు. నెల్లూరు డిఆర్ఓ శ్రీ సి.హెచ్. సత్యనారాయణ ముఖ్యఅతిథి. బివిఎస్ హై స్కూలు హెడ్మాస్టరు శ్రీ ఆర్. సుందర రావు, ఆల్ఫా షటిల్ క్లబ్ అధ్యక్షుడు శ్రీ హెన్రీ మాట్లాడారు.

కె. రామారావు, కె.జి. శ్రీనివాస్‌ల జంటకు ప్రథమ బహుమతి; పి. వెంకటేశ్వర్లు, రవిలకు ద్వితీయ బహుమతి లభించాయి. డాక్టర్ శ్రీధర్ ఉత్తమ క్రీడాకారుడిగా ఎంపికైనారు.

క్లబ్ కార్యదర్శి శ్రీ గోవర్ధన్ వందనాలు చెప్పారు.

### ఉద్యోగావకాశాలపై సమావేశం

స్వదేశంలో, విదేశాలలో గల ఉద్యోగావకాశాల పై యువతీ యువకులకు అవగాహన కల్పించడానికి ఆదర్శ కాంపిటీటివ్ కోచింగ్ సెంటర్ 25 తేది టౌన్ హాల్ రీడింగ్ రూమ్‌లో ఒక సమావేశం జరిపింది. సెంటర్ డైరక్టర్ శ్రీ బి. కృష్ణమూర్తి అధ్యక్షించారు. ఉద్యోగ విజయాలు సంపాదకుడు శ్రీ ఆలూరు సుభాష్ బోస్ నిరుద్యోగుల సందేహాలకు సమాధానాలు చెప్పారు. 'సిరివెన్నెల' సంపాదకుడు శ్రీ పురాణ పండ రంగనాథ్, శ్రీ బి. రవీంద్ర మాట్లాడారు. శ్రీ బి. దివాకర మూర్తి, శ్రీ బి. సత్యమురళీధర్ స్వాగత వందనాలు చెప్పారు.

## మనసున్న వారి కోసం మంచి కథలు

# చిగురించిన గులాబి

**గ్రంథసమీక్ష**

రచయిత:
పోట్లూరి సుబ్రహ్మణ్యం

ప్రతులకు:
మహీధర పబ్లికేషన్స్
పూలతోటవీధి
కోవూరు – 524 137
వెల: రూ. 25 లు

సమీక్షకుడు
గ్రిద్దలూరు గోపాలరావు

'కథ' ఎప్పుడు పుట్టింది అన్న విషయం పై పలువురు పలురకాలుగా చెప్తున్నారు. నా ఉద్దేశ్యంలో మానవ సమాజంలో "తాతా– అవ్వ" పుట్టినప్పుడే కథ పుట్టివుంటుంది. ఎందుచేతనంటె మనవళ్ళు మనవరాళ్ళు ఊగతెలిసినప్పటి నుంచి కథలు చెప్పమని తాత– అవ్వలను ప్రాణం తీసి చెప్పించుకుంటూ వుంటారు గనుక.

నెల్లూరు యువ రచయిత పోట్లూరి సుబ్రహ్మణ్యం కథలు వ్రాయటంతో సాహిత్య రంగ ప్రవేశం చేశారు. ఆయన వ్రాసిన ఎనిమిది కథలను "చిగురించిన గులాబి" పేరున పుస్తక రూపంలో వెలువరించారు. ఇది ఆయన రెండవ కథా సంపుటి. చెదురు మదురుగా పత్రికల్లోను పుస్తకాల్లోను కథలను చదవటమే గాని వాటి సార్థకతను అనుభవించటం, ఆనందించటం కరువయింది – చాలా నాళ్ళ నుంచి! "చిగురించిన గులాబి" లోని కథలను ఈనాడు చదివి చాలా విళ్ళకు ప్రాయోజికత్వాన్ని, ఆనందాన్ని పొందగలిగాను. ఎనిమిది కథల్లో ప్రతిదీ మనసున్న కథ. చదివే వారిని మనస్ఫూర్తిగా పలుకరించి ప్రయోజనం కలిగిస్తుంది ప్రతి కథ. అంతే కాదు ప్రతి కథకు అభ్యుదయకరమైన హృదయముంది. హృదయమున్న ప్రతి పాఠకుడ్ని ఆదర్శవంతంగా మలుస్తుంది.

అందరి జీవితాలూ చిగురించినే గులాబీలు కావు. వడ్డించిన విస్తరి కాదు, పరచిన పట్టు పాన్పు కాదు. అలా కాని జీవితాలకు అలాగా తీర్చిదిద్దుకునేందుకు ఈ ఎనిమిది కథలు మంచి అవకాశం కలిగిస్తాయి.

ఈ యువ రచయిత పై ఏ ఇతర రచయిత ముద్రాలేదు. ఎవరి మాదిరో, లేక ఏదో ఒకటి చెప్పాలనో ప్రయత్నించి వ్రాసిన కథలు కావివి. సామాజిక జీవితానికి చేరువగా వుంది. తీవ్రంగా పరిశీలించి వుండనిదే రచయితకు ఈ కథాంశాలు చిక్కివుండవు. ఈ రచనా బలం అబ్బి వుండదు. ఈ కథలు ఇంత వాస్తవ రూపం దాల్చి వుండవు. సుబ్రహ్మణ్యం, లోకాలోకనంలో ఒక విశిష్ట దృక్పథం వుంది. సమాజంలోని సంకుచిత తత్వాన్ని, మానవత్వంలోని విశాల త్వాన్ని కొత్త దృష్టితో చూడగలడు. తనదైన స్పందన పొందగలడు. చీకటిలోంచి వెలుగులోకి ప్రస్థానం చెయ్యగలడు. అందువల్లనే ఈ ఎనిమిది కథల ద్వారా, చీకటిలో నలిగే బ్రతుకులు వెలుగు నివసించే హృదయాల్లోకి వెళ్లేమార్గం చూపాడు.

సుబ్రహ్మణ్యం పరిశీలన, అనుభూతి, అనుభవం వాస్తవిక కథాంశాల సేకరణ లోనే కాక తెలుగు భాషా సాహిత్యం మీద గూడా వుంది. అందుకు సాక్ష్యం ఆయన కథల్లో సుందరంగా, ముగ్ధమనోహరంగా వున్న వర్ణనలే. "ఈ ప్రశ్నకు బదులేది?" కథలో అర్ధనగ్నయువతి వర్ణన యిలా వుంది. "శరీరం మీద ఎల్లోకలరు లంగా, బ్రా మాత్రమే వున్నాయి. లంగాకు, బ్రాకు మధ్య వున్నఖాళీ స్థలం సూర్యాస్తమయ సమయంలో భూమిని, ఆకాశాన్ని కలుపుతూ మధ్య ఏర్పడిన సంధ్యా సమయంలా వుంది" ఈ వర్ణన రంగులకుంచెతో గీచిన చిత్తరువులా లేదూ! ఒక్క శృంగారంలోనే కాదు, వేదనలోను, ఆవేదనలోను, ఆరాధనలోను, ఆత్మార్పణలోను ఇలా ఎన్నో జీవిత విశేషాల్లో యిలాంటి వర్ణ చిత్రాలు అన్ని కథల్లో కనిపిస్తాయి.

ధనమెత్తు ఔదార్యము, మనిషెత్తు మానవత్వం, చదువెంతైనా, పెద్ద ఎత్తున సాహిత్యాభిమానమూ గల నెల్లూరు శాసన సభ్యులు శ్రీ జె.కె. రెడ్డి గారికి మానవత్వపు విలువలు గల ఈ కథా సంపుటిని అంకిత మివ్వటం అన్ని విధాలా సమంజసంగా వుంది.

# పంచాంగం

(2 పేజీ కొరవ)

పౌర్ణమి దినములలో వివాహాది శుభ కార్యములు చేయరాదు.

11.5.92 తేది నుండి 28.5.92 వరకు కర్తరి.

## కృష్ణ పుష్కరం

10.9.92 తేది గురువారము కృష్ణానది పుష్కరములు. ఈ 12 దినములు కొందరు కన్యారాశిలో గురువుండుట వల్ల కృష్ణ — కావేరి మధ్య గల ప్రజలు శుభకార్యములు చేయరాదని చెప్పుచున్నారు. ఈ విషయము ఏ జోతిష్య గ్రంథమున గాని, ధర్మశాస్త్రమున గాని, గత పంచాంగ ములలో గాని చెప్పబడలేదు. అందుచే కృష్ణా తీరమున గలవారితో సహా అందరు శుభకార్యములు చేసికొన వచ్చును. గోదావరి పుష్కర సమయము నందు గల దేశకాల నియమములు కృష్ణా పుష్కరములకు అన్వయించవు.

## ఒక్క చంద్రగ్రహణం

10.12.1992 తేది మార్గశిర శుక్ల పూర్ణిమ గురువారము ఉదయము గంట 3.10 నుండి గంట 5.25 వరకు పూర్ణ చంద్రగ్రహణము

## సంక్రాంతి పురుషుని ఫలితం చర్యలు

14.1.93 తేది పుష్య బహుళ సప్తమి గురువారము ఉదయము 8.00 గంటలకు మకర సంక్రమణ పర్వదినము అయిన భేదకాల పరిగణనను బట్టి కాలపురుషుని రూప నిర్ణయము చేసిరి. ఈ సంక్రాంతి పురుషుని పేరు మందుడు. అశ్వ వాహనము, రాజకీయ అశాంతి ప్రముఖ విద్యావేత్తల మృతి. దక్షిణాది రాష్ట్రములందు అరాచక ప్రమాదములు సంక్రాంతి పరిగణన ఫలితములు. ఇంకను సుగంధ ద్రవ్యములు నూనెలు మెట్ట ధాన్యముల ధర స్వల్పముగు హెచ్చును.

## గ్రహ సంచారం దేశారిష్టాన్ని సూచిస్తున్నది

1992 సెప్టెంబరు వరకు సింహరాశి యందు గురువుండి తరువాత కన్యరాశి ప్రవేశించును. అందుచే 1992 మే నెల నుండి సెప్టెంబరు లోగ ఇండియాకు ఉత్తరమున నున్న రాజ్యాధినేతలకు ప్రమాదము కలుగ గలదు.

1992 ఏప్రెల్ నుండి జరుగు శని చలనము వలన ఏప్రెల్ ఆగస్టుల మధ్య తూర్పు ఆసియా దేశములందు ప్రజా ఉద్యమములు ప్రభుత్వ ఎతమములు జరుగును. 1992 సెప్టెంబరు నుండి 1993 మార్చి వరకు శని, కుంభ రాశికి ఉన్ముఖుడై నందున ఆఫ్రికా ఆసియా, యూరప్, లాటిన్ అమెరికన్ దేశాలలో ఆర్థిక రాజకీయ సంక్షోభములు కలుగును. ఆ సమయమున మన దేశమున ప్రముఖ వైద్యులు, కళాకారులు, కవులు, సంఘ సేవకులకు హాని కలుగును. శుక్రు తస్త్రంగతుడైనపుడు అనగా 1992 మే – జూలైల మధ్య అరాచక శక్తుల తీవ్రత ఎక్కువగ నుండును.

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

బ్రతుకుల్లో వున్న తన తండ్రి కోరిక తీర్చేందుకు సూర్యారావు పెళ్ళి చేసుకున్నాడని, శోభనం రోజు సూర్యారావు చెప్పగా, సీతారత్నంకు తెలుస్తుంది. ఆ క్షణం నుంచి, ఆత్మాభిమానం గల సీతారత్నం భర్తతో పొందుకు అవకాశమివ్వలేదు అందువల్ల ఆమెకు పిల్లలు కలగలేదు.

సీతారత్నం, తమ్ముడు కుమార్తె మంగను వంశీ ప్రేమిస్తాడు. పెళ్లి చేసుకునేందుకు నిర్ణయించుకుంటాడు. సీతారత్నానికి ఆమె తమ్ముడికి బద్ధ విరోధం. అందుచేత పెళ్ళి చూపుల రోజు వంశీ తండ్రి ఎవరో తెలియకుండా పెళ్ళి జరగటం యిష్టం లేదని తమ్ముడు పేచీ పెట్టడంతో తాత్కాలికంగా పెళ్లి ఆగుతుంది. తన మొదటి భార్య కుమారుడని సూర్యారావు చెప్పే ధైర్యం చెయ్యలేక పోతాడు.

సీతారత్నం వంశీని దత్తు తీసుకుంటుంది. ంత వరకు రెండవ భార్యగాను, తమ్ముడి తగాదాలతోను అనుభవించిన హృదయ భారంతో ఆమెకు తెలియకుండా నే ఆమె ప్రాణాలు అనంత వాయువుల్లో కలసిపోతాయి.

కథ బాగుంది, సూర్యారావు (సత్యనారాయణ), సీతారత్నం (వాణిశ్రీ), తమ్ముడు (కోట శ్రీనివాస రావు), సుమిత్ర (మణిమాల) పాత్రలు గ్రామీణ వాతావరణానికి అణువుగా మలచి చక్కగా ఉపయోగించుకున్నాడు.

## లాటరి

(4 పేజీ కొరవ)

అంగళ్లముందు వందల సంఖ్యలో జనం గుమికూడుతున్నారు — నంబర్లకోసం. ఏ ఒకరికో, ఇద్దరికో పది, పదిహేను రెట్లు డబ్బు వస్తుంది; తక్కినవారు తెల్లముఖం వేసుకొని తిరిగి పోతున్నారు. ప్రక్కరోజైనా తమను అదృష్టం కరుణించక పోతుందా అన్న ఆశతో మరిన్ని టిక్కెట్లు కొంటున్నారు. ధృవపడలేదు కాని, ఒక అమాయకుడు వరుసగా పది, పదిహేను రోజులు ఈ జూదమాడి, దాదాపు 70 వేలు పోగొట్టుకొని, ఆ దెబ్బకు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకున్నాడట. ఎందరో వేలు పోగొట్టుకొని, ప్రక్కవారికి కూడా చెప్పుకోలేక, కుమిలిపోతున్నారు.

మామూలు లాటరీ టికెట్టు అయితే, ఒకటో రెండో కొని గమ్మునుంటారు. కాని, ఈ నిత్యలాటరీలు కొనేవారు ఒకేసారి వంద, రెండు వందల టిక్కెట్లు కొనడం మామూలై పోతున్నది. ఫలితంగా కొంపలు గుల్ల అవుతున్నాయి. పూర్వం కాటన్ మార్కెట్ ఇటువంటి వారినెందరినో నాశనం చేసింది. పెద్ద పెద్ద భూస్వామ్య కుటుంబాలకు చెందిన ఇల్లాళ్లు ఈ మోజులో పడి, ఇళ్లతో సహా తాకట్టు పెట్టి, చివరకు ఆత్మహత్యలు చేసుకొన్న సంఘటనలున్నాయి. లాటరీ పేరుతో ఆ దుర్మార్గ జూదం ఇప్పుడు రాత్రికి రాత్రి లక్షాధికారులు కావాలనే దురాశకు లోనయ్యే వారిని వలలో వేసుకుంటున్నది.

ఈ లాటరీలు ఎంతమాత్రం చట్టబద్ధమో ఎవరికీ తెలియదు. దేశం సంగతి ఎటుపోయినా, కనీసం ఆంధ్ర రాష్ట్రంలో ఈ మహమ్మారికి మరింత మంది బలైపోకముందే ప్రభుత్వం వీటిని నిషేధించడం అవసరం.

## సింహపురి

(4 పేజీ కొరవ)

నిర్లక్ష్యానికి గురైన ప్రదేశాలను అధ్యయనం చేసి, కనీస వసతులు కరువైన నివాస ప్రాంతాలను గుర్తించి వాటి పై నిధులను ఖర్చు చేయడం ప్రజల మన్ననలు పొందుతుంది.

మునిసిపల్ స్కూళ్లు అధ్వాన్న పరిస్థితిలో వున్నాయి. ఎక్కడా గతిలేని వారు తప్ప వాటిలో చేరే ప్రసక్తి లేదు. కనీసం కొన్ని స్కూళ్లనైనా గుర్తించి, వాటిలో మంచిఉపాధ్యాయులను తగినంత మందిని నియమించి ప్రజలలో ఆ స్కూళ్ల పట్ల విశ్వాసాన్ని పునరుద్ధరించాలి!

కలెక్టర్ గారిపై ప్రజలు, కొండంత ఆశతో వున్నారు. ఉన్న సమయం కొంచెం, ఇప్పటికే రోజుకు 18 గంటలు పనిచేసినా చాలనంత పని వుంది. మునిసిపాలిటీ పై ఎక్కువ సమయం వెచ్చించడం అసాధ్యం. ఆ కొద్దిలోనే ప్రజలకుపయోగపడే పనులు చేయగలరన్న నమ్మకం ప్రజలకు వుంది. ఆ నమ్మకం వమ్ముగాదని ఆశిద్దాం!









## జిల్లా మునిసిఫ్ కోర్టు : పెనుకొండ

S C : 39/92

శ్రీ అనంతపురం గ్రామీణ బ్యాంకు, పుట్టపర్తి. — వాది

P. నాగభూషణం, మరియు
y. నల్లపురెడ్డి. — ప్రతివాదులు:

### ఒకటవ ప్రతివాదికి నోటీసు

పెంజారి, నాగభూషణం,
తండ్రి సుబ్బయ్య, జానకం పల్లి,
బుక్కపట్నం మండలం
సత్యసాయి తాలూకా.

పై దావాలో మొదటి ప్రతివాదికి తెలియజేయడం ఏమనగా, దావా మీ హాజరు నిమిత్తం 24.4.92 వ తేదికి పై కనుపరిచిన కోర్టులో వాయిదా వున్నది. సదరు వాయిదా నాటికి మీరు కాని, మీ వుత్తర్వులు పొందిన న్యాయవాది ద్వారా గాని హాజరు కాని యెడల దావా మీ పరోక్షంలో తీర్మానించబడును.

T. రాజారామ్,
అడ్వకేటు.
6-471-2A, Ram Nagar, Anantapur

## ఒంగోలు 1 వ అ.డి. ము. కోర్టులో

EP 433/82 :: OS 184/1975

పెంట్యాల శ్రీ రాములు వగైరా — డి.హెచ్. అర్స్
మందూరి వెంకటేశ్వర్లు అండ్ కంపెనీ, సీతారాం పురం వగైరా — జె.డి.అర్‌లు

డి.హెచ్.అర్. తరపున 2 వ జె.డి.అర్ తాలూకు వేలంవేయవలసిన స్థిరాస్థి పెద్యూలు.

ఒంగోలు డి.రి. యెదుగుండ్ల పాడుమజరా వెంకట్రాజా పాళెంలో 2వ జె.డి. అర్‌కు హక్కుభుక్తములుగల స్థిరాస్థి వివరం.

1) పట్టానెం. 105 సర్వేనెంబరు 22/1 య.1.80 సెంట్లలో య. 1.56 సెంట్లకు హద్దులు. తూ. మందూరి రామయ్య వగైరా ద)మందూరి పెదకోటయ్య ప)తిప్పిరిశెట్టి కోటేశ్వరరావు ఉ)పాటి బండ్ల సుబ్బారావు యిందులోని య 1.56 సెంట్లు లేక 63,1013 హెక్టార్లు.

DHR క్రయం రూ. 5000/-
అమినా క్రయం రూ. 9000/-

2) పట్టానెం. 326 B. సర్వేనెంబరు 28/13 య12-16 సెంట్లలో య. 3.38 సెంట్లకు హద్దులు తూ) నన్నపనేని రాఘవులు ద)మందూరి రామయ్య ప)మందూరి సుబ్బారావు ఉ)మందూరి కోటయ్య. ఇందులోని య. 3.38 సెం. లేక 136. 78.19 హెక్టార్లు

DHr క్రయం రూ. 10,000/-
అమినా క్రయం రూ. 19,000/-

3)పట్టానెం. 120 సర్వే నెం. $9\frac{1}{5}$ య 5.45 సెంట్లలలో య. 1.56 సెంట్లకు హద్దులు తూ. మార్నెని కిష్టమ్మ. ద. పరిటాల కోటయ్య. ప. ముప్పా వెంకటేశ్వర్లు. ఉ. డొంక. ఈ హద్దులలోని, య 1.56 సెంట్లు లేక 60.10.13 హెక్టార్లు

DHr క్రయం రూ. 5,000/-
అమినా విక్రయం రూ. 9,000/-

4) పట్టానెంబరు 1785 సర్వే నెం. య. 32.68 సెంట్లలలో య 2.66 సెంట్లకు హద్దులు. తూ. మందూరి సుబ్బారావు. ద. మందూరి ప్రసాదరావు. ప. మందూరి రామయ్య. ఉ. డొంక. ఈ హద్దులలోని య 2.66 సెంట్ల మెట్టభూమి లేక 107.6435 హెక్టార్లు.

DHr క్రయం రూ. 10,000/-
అమినా విక్రయము రూ. 14.000/—

5) పట్టా నం. 1785 సర్వే నెం. 29/2 య 6.56 సెంట్లలో యం. 55 సెంట్లకు హద్దులు తూ. దండు వెంకారెడ్డి. ద. బత్తుల వెంకట సుబ్బారెడ్డి. ప. మందూరి సుబ్బారావు. ఉ. పాటిబండ్ల సుబ్బారావు లోని య. 0.55 సెంట్లు మెట్టభూమి లేక 0.222 577 హెక్టార్లు.

DHr క్రయం రూ. 2,000/-
అమినా క్రయం రూ. 4,000/-

వేలం వాయిదా : 22.4.92, ఫరదర్ హియరింగ్ 29.4.92

M V సుబ్బయ్య
DHr అడ్వకేటు



ఆఫీసులో ఎడమొగం పెడమొగం—
ఆటలలో ఎదురు ముఖం!

కమీషనర్ జి. రామనారాయణ రెడ్డి, ఛైర్మెన్ టి. రమేష్ రెడ్డి

## పినాకినీ తీరం

2 పేజీ తరువాయి

ప్రాణం అంత చౌకా? దాన్ని తీయడం అంత సులభమా ? అఘాయిత్యపు మాటలు వరవ డానికి, వినడానికి, జుగుప్సాకరంగా వుంటాయి !

తరవకొకర్ని తన ప్రాణానికి బాధ్యులుగా చేస్తూపోవడం కంటే, ఒక్కసారి క్రింది మొదలు పై వరకు ఆలోచించి, జ్ఞాపకం చేసుకొని, భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో తనకు విరోధులనుకున్న వారితో, విరోధులుగా వున్న వారితో, విరోధులు కాగల వారనుకున్న వారితో — యమధర్మరాజుతో సహా — ఒక సమగ్రమైన జాబితాను తయారు చేసి వీరందరి హిట్‌లిస్టులో వున్నానని ఒక్క సారి ప్రకటించి వేస్తే శ్రమ తప్పుతుంది. ప్రాణానికి ఫూల్ ప్రూఫ్ భద్రతా ఏర్పడుతుంది గదా!

జనార్ధన రెడ్డి గారూ, దయచేసి మీరూ మతి తప్పకండి !

### కుర్చీ వదలి బోర్డుకెక్కిన రమేష్ రెడ్డి !

శ్రీ తాళ్ళపాక రమేష్ రెడ్డి మునిసిపల్ ఛైర్మన్ కుర్చీ వదలిన మరురోజే నేమ్ బోర్డు రూపంలో వీధికెక్కారు. అంటే మునిసిపల్ కౌన్సిల్ చివర రోజు సమావేశంలో, ఆఖరు నిమిషంలో .సి.ఎ.ఎం. హైస్కూలు వెనుక వున్న నియనముదాయప్రాంతానికి రమేష్ రెడ్డి నగర్ అని నామకరణం జేస్తూగావింప బడిన తీర్మానానుసారం ఏప్రెల్ 1 తేది తెల్లవారే సరికల్లా కోర్టు ప్రక్కన వున్న వీధికి, అటు ఇటు ట్రంకు రోడ్డు మీద వచ్చిపోయే వారికి కనపడేట్లు రెండు బోర్డులు నిటారుగా సాక్షాత్కరించాయన్నమాట. అందుకే కుర్చీ వదలి బోర్డు మీద కెక్కాడనడం !

ఆ బోర్డులైనా ఎట్లా వున్నాయనుకున్నారు ? తెలుగు దేశం పసుపు రంగు పులుముకొని వీడని మిత్ర బంధానికి చిహ్నంగా ఎర్ర గీత తిలకంగా దిద్దు కొని, నిండు ముత్తయిదువులా, సర్వశోభితంగా ఎబ్బెట్టుగా, చూపరుల దృష్టిని ఆకర్షిస్తున్నాయి. తరతరాలుగా ప్రజల నోళ్ళలో నిల్చిపోయిన వీధులు, రోడ్లపేర్లబోర్డులకు ఈనాటి వరకు గతి లేదు. రమేష్ రెడ్డి పేరు పెట్ట కూడదనేది నా వుద్దేశ్యం కాదు. కాని మాట వరుసకు వున్నమాట అంటున్నాను.

రమేష్ రెడ్డి ఛైర్మన్‌గా దిగిపోతూ మునిసిపల్ రాజకీయాలకు రాంరాం అన్నారు. "ప్రయత్నించు మరలా ప్రయత్నించు" అంటూ షేక్స్పియర్ అన్నాడని ఒక పాత సినిమా డైలాగ్. ఆ విధంగా రెండు సార్లు ఓడిపోయినా, పట్టు విడవని విక్రమార్కుని వలె నెల్లూరు శాసనసభ సీటుకు మూడవ సారి కూడా పోటీ చేస్తారట. సాహసం సేయరా డింభకా అంటూ ఈయన గురువుగారు అయన గురువుగారి వద్ద వుపదేశం పొందారు. ఆ వుప దేశాన్ని రమేష్ రెడ్డి కూడా అనుసరించ దలచినట్లుంది. ఎవరి ఆశలు,ఆకాంక్షలు, లక్ష్యాలు వారివి!

ఏ.సి. వంటి అజాను బాహుడు కూర్చున్న ఆ పెద్ద మునిసిపల్ ఛైర్మెన్ కుర్చీకి రమేష్ రెడ్డి మరుగుజ్జా అవుతాడనుకున్నాము. పొట్టి వాడు బహుగట్టి వాడంటారే ఆ విధంగా రమేష్ రెడ్డి ఐదేళ్ళుధీకా లేకుండా ఛైర్మెన్ పదవి చాకచక్యంగా నెరపగలిగాడు. 'అన్న' గారు అధికారంలో వున్నంత కాలం టవున్‌లో అభివృద్ధి కార్యక్రమాలు రమేష్‌రెడ్డి అంతకు ముందు ఛైర్మెన్ కంటే, కౌన్సిల్ కంటే తక్కువ చేయలేదు. పాపం, శాసన సభకు ఓడిపోయిన తర్వాత నీరసించి పోయాడు; కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చిన తర్వాత నిస్స హాయుడైపోయాడు. వుత్సాహర హితుడై పోయాడు. ఇటువంటి పదవుల్లో ఎవరున్నా, అధికార పార్టీకి చెందకుంటే, పై వారి ప్రాపు లేకుంటే ఏమీ చేయలేరు. అధికార పార్టీకి చెందిన వాడైనా, అధికారంలో వున్న వర్గానికిచెందకుంటే వారి పరిస్థితి అంతే. ఎసి సుబ్బారెడ్డి గారు అన్నేళ్ళు అడ్డులేకుండా ఏలగలిగాడంటే అయనపర్సనాలిటీ అధికారంలో వున్న వారి మీద అయనకుండిన పలుకుబడే కారణం. మహబూబ్ ఖాన్, లక్ష్మణ గుప్త, ఆనం వెంకట రెడ్డి గారలు నిశ్శబ్దంగా నెట్టుక పోయారంటే — పైన ఎ.సి. వుండబట్టి. తర్వాత అయన పేరు చెప్పుకునే! మాలకొండయ్య గారి హయంలో పేరు అయనది, అధికారం ఎం.ఎల్.ఎ. శ్రీ కె.వి. సుబ్బారెడ్డిది అనేది జగమెరిగిన సత్యం. పైన పట్టుపోయిన తర్వాత రమేష్ రెడ్డి మాత్రం వుత్తచేతుల వాడే గదా ఏమిచేయగలుగు తాడు?

పరిపాలనానుభవం లేదు; పేరు ప్రతిష్టలు లేకపోవడమే కాదు, అల్లరి చిల్లరి సినిమా ఆకతాయి అనే నీరస భావం వుండింది; అధికార్లను అదుపులో పెట్టుకో గలిగిన శక్తి లేదు; వ్యక్తిత్వం లేదు; సింహపురి పౌరులు ఎన్నుకున్నారనే ఏకైక అర్హత తప్ప మనిషిలో మరేమీ లేవు. ఈ అన్నివిషయాల్లో అర్భకుడు, అమా యకుడు అనుకున్న మనిషి ఎంత రాజకీయ చతురత ప్రదర్శించ గలిగాడు, అనేది తలచుకుంటే; ప్రత్యర్థులను సైతం ఎట్లా ఆకర్షించ గలిగాడు ఆకట్టుకోగలిగాడు, హేమా హేమీలతో ఢీకొంటూ, పార్టీ అనుబంధాన్ని, నాయకుని పట్ల అచం చల విశ్వాసాన్ని కాపాడుకుంటు, విధేయతను కాపాడుకుంటు, ఎదుటి వారిని బోల్తా కొట్టించగలిగాడు అనేది చూస్తే రమేష్ రెడ్డి అందరూ వూహించినంత సామాన్యుడు కాదు; అసాధ్యుడే అనిపిస్తుంది. అతనిలో ఏదో ప్రజ్ఞ దాగి వుంది.

పార్టీ రహితంగా పనులు చేసి పెడుతూ, అందరితో సత్సంబంధాలు కలిగివుంటూ కౌన్సిల్‌లో చివర కొచ్చే సరికి కాంగ్రెస్‌ను నామ రూపాలు లేకుండా చేశాడు. సొంత పార్టీలో దాదాపు తటస్తుడు; బయట పార్టీ వర్గ రహితంగా అందరికీ ఏదో ఒక సమయంలో శ్రద్ధా సక్తులతో వుపకరిస్తూ ఇతను ఎంతో మేలు అనిపించుకున్నాడు.

ఆఖరుకు కౌన్సిల్ ఆ పార్టీది ఈ పార్టీది కాదు, రమేష్ రెడ్డిది అనిపించుకున్నాడు.

రమేష్ రెడ్డి రాజకీయ చాణక్యానికి మరో మంచి సాదృశ్యం వుంది. ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డి గారి చేత రమేష్ రెడ్డి నా శిష్యుడు అని బహిరంగ సభల్లోనే ప్రకటింప జేసుకున్నాడు— అయన గురుత్వం, ఈయన శిష్యరికం ఎక్కడ ఎప్పుడు అని ఆశ్చర్య పోవలసి వచ్చింది. నిజంగానే ఆ సమయంలో అతనిలో ఆ వూగిసలాట వుండిందో, లేక కాంగ్రెస్‌లోని తన బంధువుల ప్రయోజనం కోసం వున్నట్లుగా భ్రమింప జేశాడో తెలియదు గాని అతను కాంగ్రెస్‌లోకి — అందులోనూ జనార్ధన రెడ్డి వర్గంలోకి — వస్తాడని, నమ్మిన వారిని అవివేకులకు చేశాడు. తన అప్తబంధువులను సన్నిహితం చేశాడు; తాను దూరమయ్యాడు. గాంధీజీ విగ్రహావిష్కరణను ఎన్టీఆర్ చేత జరిపించడమే దానికి ప్రత్యక్ష తార్కాణం. దీన్ని బట్టి రమేష్ రెడ్డిని అంచనా వేసుకోవచ్చు!

ఏమైె తేనేమి, పనికి రాదని హేళనగా అనుకోబడిన వాడు విజయ మహల్ రైల్వే బ్రిడ్జి విజయోత్సాహంతో ఐదేళ్ళు పూర్తిగా వుండి పదవి విరమణ చేశాడు. నేను ఇక్కడ నీతులు అవినీతుల విషయం స్పృశించ దలచుకోలేదు.

NDP



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara Books Pvt. Ltd. Nellore.